ప్రతులు ౧౦౦౦
విక్రమ
శ్రావణ-బహుళ ద్వాదశి.

# మనవి.

"సన్తః పరీక్ష్యాన్యతరద్భజంతే
మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః"

"ప్రాతదియన్న కారణముబట్టియె సర్వము మేల్మిజెందునే?
నూతనమన్న హేతువున న్యూనతజెందునె క్రొత్తవన్నియున్?
ఖ్యాతిగ నుత్తముల్ గుణమునారసి మంచిగ్రహింతు రెప్పుడుం
బ్రాతవెమంచివందురవిమర్శత గేవల మూఢమానవుల్"

దేశోద్ధారక ప్రెస్,
తెనాలి.

# తొలిపలుకులు



కృతికర్త నాకీ గ్రంథమును దొలిపలుకులు వ్రాయుటకునై యొసంగినపుడు నేనంత యుత్సాహముతో గ్రహింపలేదు. రామరాజభూషణుఁడును, భట్టుమూర్తియు నొకరా యిద్దరా యను వాదోపవాదములఁ జిన్ననాఁటనుండియును వినుచుంటిని; చదువుచుంటిని. "ఒకరా, యిద్దరా" యను వాదము నన్నెప్పుడును నాకర్షింపలేదు. బాధింపలేదు. ఒకరైననేమి, యిద్దరైననేమి? వారి మహాత్మ్యపుష్ట గ్రంథములే నను సమాకర్షించినవి. కాని యిర్వురు మరదృష్టవంతులని మాత్రము నా విశ్వాసము. రామరాజుచే "రత్నహార హాయ వేదండాగ్రహారాది సత్కారంబు," బొందఁగలైను గాని, సోమనాథకవిచే "కారణజన్ముఁడ"ని పేర్కొనఁబడెను గాని, యాంధ్రుల నిర్వ్యాజమయిన మన్ననలకుఁ బాత్రుఁడు కాఁజాలకపోయెను. చూడుఁడు. తెలుగువారెన్ని కట్టుకథలు వీరింగూర్చి యవమానము కలుగఁజేయు తలంపుతో నల్లిరో! ఈ రామరాజభూషణ, భట్టుమూర్తుల తలవాకిట "దిష్టిబొమ్మలు"గానైన నిలుచుటకు నర్హులు కానివారుకూడ నీమహనీయులపై నిందాగర్భములగు కథలల్లిరి. ఇంతకన్నను విషాదగాథ లేమికావలయును?

(1) ముక్కుతిమ్మన్న వ్రాసిన "నానాసూనవితానవాసనల" యను పద్యమును, డబ్బిచ్చి కొని తన వసు

చరిత్ర మహాప్రబంధమున వేసికొనెనని యొకఁడును, "మోహో పదేశతమోముద్రితములైన" యను పద్యమును అయ్యల రాజు రామభద్రయ్యదగ్గరనుండికొని, తన వసుచరిత్రమహా ప్రబంధమున వేసికొనెనని మరియొకఁడును గథలల్లిరి. కోటి జన్మము లెత్తినను నా కవు లిద్దఱట్టి పద్యములు వ్రాయ నేర్తురా? వారి కృతులయందు నాపద్యములతోఁ దులతూగఁ గల్గు పద్య మొక్కటైన నున్నదా?

(2) ఈర్ష్యాసూయలచేఁ గ్రుళ్ళికంపెత్తు "అప్పకవి" వాదమునందు రామరాజభూషణుని నోడిచిపుచ్చి యయ్యల రాజు రామభద్రుఁడు, వాని తలపాగ హరించెనని, యొక్క కట్టుకథ; దానికొక పద్యము. ఇరువురి కవితాప్రౌఢిమయందును, హస్తిమశకాంతర మున్నదే! వాని తలపాగ వీఁడు హరియించు టెట్లు పొసఁగును? ఇంతియకాక రామరాజ భూషణునకు "వాఁడు" అను బిరుదము నిచ్చె నీ యప్పకవి.

(3) "చీపర పాపరతీగల
చేపలబుట్టలినట్టు" యను పద్యమును,
"కాకమానిరాయ నీకెతగుర" యను పద్యమునకుఁ
జెప్పునర్థమును నీచాతినీచములు.

(4) "శ్రీభూపుత్రివివాహవేళ నిజమంజీరాగ్ర" యను పద్యమునకుఁ జెప్పునర్థము "కడుపు కాలినమ్మ" చేయుపని.

(5) లక్ష్మీనరసింహాచార్యులను నింకొక మహానీయుఁడు "అల్లసాని పెద్దనార్యశిష్యేణ భట్టుమూర్తిమహాకవినా విరచితే వసుచరిత్రే" యని వచించినాఁడు. భట్టుమూర్తిని గురుద్రో

హీనిగా లోకమున జూపించుటకు నీ కథనల్లెను. భట్టుమూర్తి తన గ్రంథములందెచ్చటను పెద్దనదగ్గర "తల్లీ! నిన్నుదలంచి పుస్తకము చేతం బట్టితిన్" అని చెప్పియుండలేదు. వీనికే దేవుడు కలలోవచ్చియీ విషయము చెప్పిపోయెనోగదా! ఇంతమందియీర్ష్యాసూయలకు గురియైన ఈ గ్రంథములయందు మహత్తరశక్తి యేదియో యుండవలయును. నేడు దానిని గొంతమందియైన గ్రహింపగల్గుట శుభచిహ్నము.

ఈ గ్రంథమున గొఱ్ఱెపాటి వేంకటసుబ్బయ్యగారు చిరకాలమునుంచి తెలుగుదేశమున విహారము చేయుచున్న యీ వాదమును గూలంకషముగను, సర్వతోముఖముగను జర్చించి నిగ్గుదీసినందులకు వారి నభినందించుచున్నాను.

అహమహమికఁజూపక మిగుల నోర్పుతో ప్రతివిషయమును మూలమట్టుగఁ జక్కగాఁ జర్చించి, యితరుల వాదమును బూర్వపక్షముఁజేసి, తమ వాదమును నైపుణితో సిద్ధాంతపఱచికొనఁ గల్గిరి. శైలి మనోరంజకముగా నున్నది. అర్థాంతరములుగాని, యంతరార్థములుగాని చెప్పుటకు వీలు లేని పదజాలము నుపయోగించి, రమణీయకముగ నీ గ్రంథము వ్రాసిరి. గ్రంథములోఁజెప్పఁబడినవిషయమును నిచ్చటఁ జర్విత చర్వణముగాఁ జర్చింపఁ దలంచుకొనలేదు. ఇఁక నీ వాదమింతటితో ముగియునని తలంచెద.

సూతాశ్రమము,
తెనాలి.
6-9-40

ఇట్లు,
త్రిపురనేని రామస్వామి.

# విజ్ఞప్తి

వందివంశజులగు మూర్తిరామరాజభూషణులను కవులు ౧౬ వ శతాబ్దమున నుండిరి. మూర్తి నరసభూపాలీయమను కావ్యాలంకార సంగ్రహమును రచించెను. "ఇతడు కావ్యాలంకార సంగ్రహమునకుదగినవాడు. ఆంధ్రకవులలో నిట్టిలక్ష్యలక్షణనిరూపణమునకు నితనిని బోలువారే లేనప్పుడు మించినవారుండరుగదా! కావ్యాలంకారసంగ్రహ మితని సాహితిని కవిత్వశక్తినింగూడ బ్రదర్శించుచు కవితో నైక్యమొందినట్లున్నది. శక్తికి దగిన కృతి. కృతికిదగిన కవి. అతిపాండిత్య కవితాశక్తులు గూడిన గల్గు ఘటనకితడు దృష్టాంతము". *

రామరాజభూషణుడు వసుచరిత్ర మను ప్రబంధమును హరిశ్చంద్ర నలోపాఖ్యాన మను ద్వ్యర్థికావ్యమును రచించెను. ఈతని వసుచరిత్ర "మప్పటికి బుట్టిన యెల్లప్రబంధములనుండి రుచుల గ్రహించి దివ్యమైన యనుసృతి యైనది. స్వాతంత్ర్యము గోల్పోయినది. వసుచరిత్రములోని సుగుణములు సమష్టిభావన కింతేయైనను, వ్యష్టిభావము ననుసరించినచో కవియుద్దేశము బరికించినచో కావ్యాలాప రత్ననిధి యనుట కేమిసందేహము? నిస్సందేహముగా నమూల్యములగు ననేక భావనానుసృతులున్నవి. సాహిత్యముతో సంగీతము జతపడినది. శైలి మధురమంజుల వాగ్విలాసవిపులమై, శ్రావ్యమై, శ్లేషానుప్రాణితమై మనోహరమయినది", *

---

* ఆంధ్రవాఙ్మయ సంగ్రహము. ౧౭౩ - ౧౭౪).

ఇట్లు మన ఆంధ్రవాఙ్మయకవితా ప్రపంచమున ప్రఖ్యాతి గనియున్న నీకావ్యకర్తలను భిన్నకవులని కొందరును, మూర్తికే జగత్ప్రసిద్ధుడగుకృష్ణదేవరాయలకునల్లుడగుఅళియ రామరాయల సభకు అలంకారముగ నుండుటచే "రామరాజ భూషణు"డను బిరుదము కలిగెననియు అందుచే వీరిరువురు అభిన్నులని కొందరును వాదించుచున్నారు.

వీరిరువురొక్కరే అను సంగతి అనుశ్రుతముగ వచ్చుచున్నది. ఆవాదమును ప్రథమమున శ్రీ గురజాడ శ్రీరామమూర్తిగారు తమ కవిజీవితములలో ఖండించి వీరిరువురు భిన్నులని నిరూపించిరి. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ కవుల చరిత్రలో వీరు భిన్నులని నిర్ణయించి యుండిరి. అముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతులును, ఆంధ్రదేశమున ప్రథమ విమర్శకులు నగు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు శ్రీ వీరేశలింగం పంతులుగారి వాదమును ఖండించి భిన్నత్వమును సిద్ధాన్తీకరించిరి. ఈ వాదమును పండితులు, వైయాకరణ సార్వభౌములును నగు శ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు హరిశ్చంద్రనలోపాఖ్యానమున క్లుప్తముగను వసుచరిత్రవిమర్శనమున విపులముగను చర్చించి, ఐక్యతావాదమును పరిపోషించిరి. ఈ విధముగ ఆంధ్రలోకమున నీ వివాదము వ్యాపించుటచే ఆంధ్రవిద్వల్లోకము ఈవిషయమున రెండు తెగలయినది.

పయివారందరు పండితులు పూజ్యులునగు విమర్శనాదిగ్దంతులు. వారు తమతమ వాదముల నాసికాంగుళన్యాయ

మున నిర్ణయించిరి. ఈ వాదోపవాదము లన్నియు ముగిసి, నేటికి శ్రీ సీతారామశాస్త్రిగారి వాదమే నిలిచియున్నది. ఈ వివాద విమర్శనములనన్నిటిని సాకల్యముగ పరామర్శింపగా నేను మిసుమిక్కిలి సంశయమనస్కుడ నయితిని. అందుచే తత్వ్వమారయగోరి ఈకవుల గ్రంథముల విమర్శకదృష్టితో పరిశోధింపగా చివరకు వీరు అభిన్నులను అభిప్రాయమే స్థిర పడినది.

ఆంధ్రదేశమున వీరిరువురొక్కరే యనెడువారుఅనేకు లుండియుండుటచేతను, నేనెరిగినంతవరకు అభిన్నవాదులలో శ్రీ శాస్త్రిగారే చివరివారగుటచేతను, వారి * యుక్తులను ఖండించినగాని భిన్నత్వము నిర్ణయముకాదు గనుక నే నీ చిన్న విమర్శనమును వ్రాయవలసివచ్చినది.

ఇంతియగాక ఆంధ్రసాహిత్యమున ప్రఖ్యాతిగాంచిన గ్రంథరాజముల రచించిన యీ కవితల్లజులనామములు సరిగా గ్రహింపగల్గజేయుటయు,ఆంధ్రభోజుడని ప్రఖ్యాతిగాంచినకృష్ణ దేవరాయలు పెద్దనచే ఆముక్తమాల్యద రచింపజేసి తనపేర విశ్రుతిగావించుకొనెనని ప్రచారముననున్న అపఖ్యాతిని రూపు మాపుటయు నా యీ విమర్శనమునకు ప్రధానోద్దేశ్యములు.

ఇందు నేనెంతవరకు కృతార్థుడ కాగలిగితినో నిర్ణయిం చుటకు విమర్శకపాఠకలోకమే ప్రమాణము. గుణగ్రహణపారీ ణులగు పాఠకులు నీరక్షీరన్యాయమున నిందు తప్పులమన్నించి గుణలేశమును పరిగ్రహింప వేడికోలు.

---

* శాస్త్రిగారి వసుచరిత్ర విమర్శనము, ద్వితీయ ముద్రణము.

కవిరాజులు, శతావధానులు నగు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు అడిగినంతనే ఆదరాభిమానములతో తొలిపలుకులు వ్రాసి నాయీ కృతిని గైసేసినందులకు వారి కెంతయు కృతజ్ఞుడను.

ఘంటశాల,
౧౦-౯-౪౦. } గొట్టెపాటి వెంకటసుబ్బయ్య.



# కొన్ని అభిప్రాయములు

"మీ రొనర్చిన పరిశ్రమము స్తవనీయము. ఆముక్తమాల్యదా రచయిత కృష్ణదేవరాయలేయనియు, సంస్ఫూపాలీయ, వసుచరిత్ర కర్తలొకరు కారనియు నాకు బాల్యమందే యొకమూలక ఫుమ్మడినమ్మిక కల్గినది. దానిని నేనింత వఱకు మార్చుకోలేను......ఈ విషయములో మీకును నాకును ఐక్యం,"

కడియం
2—11—40 } చెళ్ళపిళ్ల వేంకటశాస్త్రి; శతావధాని

"తెలుగు సారస్వతాన్ని చిరకాలంగా కలవరపరుస్తూవున్న సమస్యల్లో భట్టుమూర్తి రామరాజభూషణులు ఒకరా యిద్దరా అన్నది ఒకటి. ఈ సమస్యవిషయంలో ఘంటశాల నివాసులైన శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు ఎనిమిది అణాలు వెలగల నూరు పుటల విమర్శక గ్రంధాన్ని వెలువరించారు.

పూర్వవిమర్శకుల వాదాన్ని అన్నిటిని పూర్వపక్షం చేసి భట్టుమూర్తి రామరాజభూషణులు విభిన్నులని నూటిగా ప్రమాణీకరించే గొప్ప విమర్శక గ్రంథమిది.

ఆంధ్రసారస్వత జిజ్ఞాసువులు తప్పక చూడతగ్గ గ్రంథాల్లో ఇది ఒకటి.

మదరాసు ప్రజామిత్ర,
1940—11—17.

"భట్టుమూర్తి రామరాజభూషణ నామము లొక్కనివా? ఇద్దఱివా? అని చర్చించిన విమర్శన గ్రంథమిది. నన్నూఱేండ్లనాటి కవులను పైకి లాగికొనివచ్చి పేరును గూర్చి చర్చించుచు పూర్వపక్ష సిద్ధాంతములుచేయుట మన ప్రస్తుత స్థితిగతులలో ఆశ్చర్యకరముగా నుండవచ్చును. కాని విమర్శకుల కీ కాలభేదము లేదు. వారికీ యనంతమగుకాలము అఖండస్వరూపము. చరిత్రకారులకు భూతకాలమే ప్రధాన రంగము. వాఙ్మయానురక్తుల కిది పొలిమేరలోనిదే.

శ్రీ వఝ్ఝల చినసీతారామశాస్త్రిగారు తమ 'వసుచరిత్ర విమర్శనము'లో ఈ విషయమును సమగ్రముగా చర్చించి యీ రెండుపేరులు నొక్కనివేయని నిర్ధారణ చేసియున్నారు. దానిని ఖండించుచు వ్రాసిన విమర్శనమిది.

ఐక్యవాదమునకు శ్రీశాస్త్రిగారాధారముగా గైకొన్న జనశ్రుతులును, చాటువులును, వాని యసందర్భములను చక్కగా జూపుచు ఇందు ఎగురగొట్టబడినవి. కవితారీతి, హనుమత్ప్రసాదము, సంగీతపరిచయము మొదలగు కారణములను ఇంకను లోతుగ విచారించి వారిభేదములను బాగుగ నిరూపింపబడినది.

శాస్త్రిగారి సిద్ధాంతము చదివినప్పుడు ఇరువురు నొక్కరేయను భావము గట్టిగ గలుగును. ఈ విమర్శనము జదివినయెడల నిరువురు వేరు అను భావము తప్పకకలుగును. ప్రశంసనీయమగు హేతువాదముతో విమర్శన మంతచక్కగ నిర్వహించుట మెచ్చదగినది.

మఱియు నిందు 'నరసభూపాలీయ' రచనాకాలము గూడ చర్చింపబడినది.

.........  ..తిరుమల దేవరాయలు రాజయిన వెనుక రచింపబడ్డదని సకారణముగా నిరూపింపబడినది. పరిశోధకు లకు, చారిత్రికులకు ఇది మనోహర విహారభూమి. భాష సరళము. కారణములు యుక్తియుక్తములు.

సంపుటము ౧ సంచిక 3- 8, ఆంధ్ర గ్రంథాలయం.

" తమ విమర్శనము సత్యమునకు, హేతువాదము నకు, ఉపజ్ఞకు, మర్యాదకు తావలమై భాషాసేవకుల నలరించుచున్నది.

పొన్నూరు,
15—9—40

ఉభయభాషాప్రవీణ
తుమ్మల సీతారామమూర్తిచౌదరి,
బోర్డు హైస్కూలు పండితుడు.

ఓమ్

# భట్టుమూర్తి
# రామరాజభూషణుడా?

ప్రాచ్యవాఙ్మయమునకు ఉత్పత్తి వికాసముల క్రమపరిణామములు ప్రదర్శించు సాహిత్య శాస్త్రములు గాని అందలి కవిపుంగవుల జీవనపరిస్థితులను-కాలమును నిరూపించు చరిత్రములు గాని స్థూలముగ లేకపోయినను సూక్ష్మముగ నేనియు లేవు. కావున మనకీ ఉత్కృష్ట మధుర సారస్వత ప్రపంచమును ప్రసాదించిన కవిబ్రహ్మల జీవనోదంతముల నించుకయైనను చవిజూడగల భాగ్యము కఱవగుటయేగాక పాశ్చాత్య విద్యా సంపర్కమువలన నిటీవల మనకుగూడ నేర్పడిన కాల నిర్ణయాదులపట్టుల వివాదములకుగూడ తెఱవయినది. దీనికిం బాత్రము లయినవారు ప్రస్తుతము మన యీ రచనమునకు ఉద్దిష్టులైనవారును నగు కవిపుంగవులు నరసభూపాలీయము, వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానములను సానల దీరిన జాతిరత్నముల మూటిని గూర్చిన భట్టుమూర్తి రామరాజ భూషణులు.

ఈ గ్రంథములగల కవితారీతుల కొన్ని సామ్యములం బట్టి గాని, అనుస్మృతముగ ప్రచారమున పాదుకొనిపోయిన ప్రవాదముల బట్టిగాని ఈ మూడుకృతులకు నొక్కరేకర్తలని కొందరును, వసుచరిత్ర-హరిశ్చంద్ర నలోపాఖ్యానముల కర్త ఒక్కడనియు, నరసభూపాలీయకర్త తద్భిన్నుడని మరికొంద రును వివదించి యుండిరి. ఆవాదోపవాదము లన్నియు నుపశ మింపగా నేటికి వీరిరువురొక్కరే అని ఉద్ఘాటించిన శ్రీ వజ్ఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారి వాదమే నిలబడియున్నది. అది సోపపత్తికము-సరసముగా నుండనందున దానిని ఖండించు టయే ఈ విమర్శనా రచనమునకు ముఖ్యహేతువు.

మును మొదట శ్రీ శాస్త్రులవారి ఐక్యతా వాదమును సమర్థించు ప్రమాణముల సారాంశమును క్లుప్తముగ నుదాహ రించి, దాని ఖండనమును వెనువెంట వివరించు చుందును.

## ఏకత్వమును సమర్థించు ప్రమాణములు—

ప్రాచీన గ్రంథకర్తలనేకులు తమగ్రంథముల వీరిని అభి న్నులుగా నటనట పరామర్శించి యుండిరి. అంతియగాక భట్టు మూర్తికి సమీపకాలీనుడగు మండల లక్ష్మీనరసింహాచార్యులు "ఆంధ్ర కౌముది" అను గ్రంథమున అల్లసాని పెద్దన శిష్యు డగు భట్టుమూర్తి వసుచరిత్రను విరచించినట్లుగను, ఆవిధము గనే కొండొంక కవి తన "లక్షణదీపిక" అను గ్రంథమునందు

గూడ పేరొకని యుండినట్లుగను శాస్త్రిగారు వ్రాయుచున్నారు. పురాణనామచంద్రికయందును, దక్షిణ హిందూస్థానకవులచరిత్రమందును, బ్రౌణ్యనిఘంటువునందును, రాధాకృష్ణ సంవాద వ్యాఖ్యానమునందును భట్టుమూర్తి రామరాజభూషణుల యైక్యము ప్రతిపాదింపబడియున్నట్లును, "అతిశ్లేష శబ్దవాగాడంబరం బొప్ప పసఘటించెను మూర్తివసుచరిత్ర" అను రామకృష్ణకవి చాటువుంబట్టియు, మనుచరిత్ర, పారిజాతాపహరణము, వసుచరిత్రములగల "పాటున కింతులోర్తురె" "ఈసునబుట్టి" "అజాజల్లి వెలుఁగు" పద్యములగూర్చిన రామలింగని పరిహాసవిమర్శనము మొదలుగాగల ప్రమాణముల బట్టి వీరి యైక్యమును శ్రీ శాస్త్రిగారు స్థాపించుచున్నారు.

సమాధానము:—

వీరివాదమును ఖండించుటకుపూర్వము ఒక చిన్న విషయమును ముచ్చటింతును. శ్రీ శాస్త్రిగారు నరసభూపాలీయము రామరాజభూషణుని కృతులలో మొదటిదనియు, నిది యెంతయు అప్రౌఢమనియు చెప్పుదురు. అట్లేయయిననితడు అనన్య లభ్యమగు "రామరాజభూషణు" డనెడి బిరుదమును రామరాజుచే బడయుటయగాక ప్రసిద్ధ ప్రబంధమగు వసుచరిత్రమునందును, ద్వ్యర్థికావ్యములకు మకుట మనందగు హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును రామరాజభూష

ణుడనెడి నామమునే వాడియుండగ బిరుదనామము పేరు ప్రతిష్ఠలు లేక యడుగంటి భట్టుమూర్తి యను నామ మేల ప్రసిద్ధ మాయెను? ఇతడు బిరుదము నందిన ప్రయోజన మేమి? వాస్తవముగ రామరాజభూషణ బిరుదాంకితుడయిన వానిచేతనే నరసభూపాలీయము రచింపబడి యున్న దానికి ఆ ప్రతీతియే రావలయును గాని వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానములకు కర్త భట్టుమూర్తి అను పూర్వ నామము లోకమున విశ్రుతి గాంచుట యేటి న్యాయము? కావున ఇది అంతయు భ్రమమూలకము. పైన పేర్కొనబడిన వన్నియు నప్రమాణములు, ప్రామాదికములును. ఇట్టివి మన ఆంధ్రవాఙ్మయమున క్రొత్తలా! రామరాజ భూషణుడు భట్టుమూర్తి అని పొరబడినట్లే ఆముక్తమాల్యదా కర్తృత్వమును కృష్ణదేవరాయలకు పెరికివైచి పెద్దన్న మెడకు నంటగట్టిరి. కోనబుద్ధరాజు, కాచవిభుడు, విఠలరాజులు విరచిన రామాయణమును గొనిపోయి రంగనాథునిపేర విశ్రుతి గావించిరి. రావిపాటి త్రిపురాంతని "ప్రేమాభిరామ" మను సంస్కృతకృతి ననుసరించి, క్రీడాభిరామమును రచించితి నని వల్లమాత్యుడు గొంతెత్తి వాకొన్నను అది శ్రీనాథుని కృతియే నని బూకరించిరి. ఇట్టి విపరీత వాదము లెన్ని అని లెక్కింపగలము? ఇట్టివి మన ప్రాచ్యవాఙ్మయమున మంద సారములు. ఈ కోటికి జేర్చిన మూర్తి-భూషణుల ఐక్య

తావాదముగూడ అంధప్రాయము, అక్రమము ననుటకు నెట్టి సందియమును లేదు. ప్రాచీను లెవ్వరును మూర్తికి రామరాజభూషణ బిరుద మున్నట్లు ప్రస్తావించి యుండలేదు. కాని వారిరువు రొక్కరే యని భ్రమ పడినట్లు మాత్రము కన్పట్టుచున్నది. ఆముక్తమాల్యద యందే శ్రీకృష్ణదేవ రాయలు స్వకర్తృత్వమును ఘంటాపథముగ చెప్పుకొని యున్నను దానిని పెడచెవిని బెట్టి పెద్దన కృతి అని మన విద్వల్లోకము వివదించుచున్నట్లే రామరాజభూషణకవి విరచితమగు వసుచరిత్రమును భట్టుమూర్తియే రచించె నని భ్రమ పడుచున్నారు. దీనికిం గారణము రామరాజభూషణు డనునది నిజనామ మనియు, భట్టుమూర్తి అనునది బిరుదనామ మనియు ప్రాచీనులు తలంచుటయని పురాణచంద్రికవలన స్పష్టపడుచున్నది. ఇది కేవలము పొరబాటు. ఆధునికులు రామరాజభూషణు డనునది బిరుదనామమని తలంచుచున్నట్లే ప్రాచీనులు భట్టుమూర్తి అనునది బిరుదనామ మని తలంచిరి. ఇవి రెండును పొరబాటులని పిమ్మట సోపపత్తికముగా తెలియజేయబడును.

ముందు ప్రాచీన కవుల ప్రమాణములు ప్రామాదికములని నిరూపించి ఐక్యతావాదమును నిర్మూలించి, పిమ్మట స్వప్రమాణముగ వీరి భిన్నత్వమును సిద్ధాంత పఱతును.

## ఆంధ్రకౌముది—శాస్త్రిగారివాదము.

రామరాజభూషణుని కాలము నందేయుండి మనుమను మల నెత్తుకొని ముద్దాడిన వేంకటపతి రాయల విద్యాగురు వగు మండల రామానుజాచార్యుని ముమ్మనుమని మనుమ డగు లక్ష్మీనరసింహాచార్యులు తాను రచించిన "ఆంధ్ర కౌముది" యందు "ము" ప్రత్యయా భావస్య అల్లసాని పెద్దనార్య శిష్యేణ భట్టుమూర్తి మహాకవినా విరచితే వసు చరిత్రే" అనియున్నట్లు శ్రీశాస్త్రిగా రుదహరించియున్నారు. (వసు చరిత్ర విమర్శ. ౭౪.పుట)

## సమాధానము—

భట్టుమూర్తి వసుచరిత్రము రచించించినట్లు ఆతని సమకాలికుడే చెప్పినని ద్యోతకమగునట్లు నతి నైపుణముగ రామానుజాచార్యునకు లక్ష్మీనరసింహాచార్యునకు గల బాంధ వ్యమును నెఱుకపఱచిరి కాని యథార్థము నారసిన ఆంధ్ర కౌముది కర్తయగు లక్ష్మీనరసింహాచార్యులు మండ రామా నుజాచార్యునకు నైదవతరము వాడని స్పష్టపడును.

వేంకటపతిరాయలు తిరుమలరాయుని నాలుగవ కుమా రుడు. ఇతడు క్రీ. శ. ౧౬౧౪ వ శతాబ్దమున రాజ్యము నేలియుండెను. అతని గురువగు మండల రామానుజాచార్యు నకు నైదవతరమువాడగు లక్ష్మీనరసింహాచార్యులు ఏ విధ

ముగ లెక్కించినను రామరాజభూషణకవికి నూటయేబది సంవత్సరములకు తరువాతివాడగుచున్నాడు. ఇట్టివాని వ్రాత ప్రమాణ మెట్లు?

లక్షణదీపిక—శాస్త్రిగారి వాదము.

అప్పకవీయమున నుదాహరింపబడి ఇంచుమించుగా రామరాజభూషణుని కాలమునందే రచింపబడిన 'లక్షణ దీపిక'లో 416 వ పద్యము తరువాత 'మంజీర' శబ్దమునకు భట్టుమూర్తి వసుచరిత్రము మొదటి పద్యము ప్రథమ చరణమున హల్లునకు ప్రయోగమని వ్రాయబడెనని శ్రీ వీరేశలింగం పంతులుగారు వ్రాసిరి. (వసు. వి. ౭౫.)

సమాధానము—

లక్షణదీపిక ఇంచుమించుగా రామరాజభూషణుని కాలములో రచింపబడినదని శ్రీవీరేశలింగంపంతులుగారు వ్రాసిరి కాని దీపికాకారుడెట్లు అతనికి సమకాలికుడో స్పష్టపరుప రయిరి. మరియు నాకాలమున రాకపోకలకనువగు ప్రయాణ సౌకర్యములు లేనందున నొండొరుల పరిచయ సందర్శనాదులకు నెట్టిఅవకాశములును లేవు. కావున దూరస్థులగు వీరు ఒకరి నొకరు నెరిగియుండుటకు నాధారములేనందు కావున లక్షణ దీపికాకారుడును ఈవిషయమున పొరపడి యుండవచ్చు ననుట పొసగునుగదా!

వీనివలెనే ఇట్టి సమీపకాలము వారెందరో పొరపడి రనుటకు ఈ క్రింది నుదాహృతములగు నవియే ప్రమాణములు. "కవికిదరువాత నల్పకాలములోనే వసుచరిత్రము వ్యాఖ్యానము వ్రాసినవారు కొందరు భట్టుమూర్తి తాను రచించిన నానారసభాసురమగు ప్రబంధమునందు వివిధాలంకారములకు లక్షణగ్రంథముగ నుండునట్లు నరసభూపాలీయ మను నలంకార గ్రంథమును రచించె"నని శ్రీ వీరేశలింగము గారు వ్రాసిరి. (వసు. వి. ౭౧)

వసుచరిత్ర గద్యమున రామరాజభూషణుడు దీనిని రచించినట్లు గలదు. నరసభూపాలీయ గద్యమున దీనిని మూర్తి రచించినట్లు గలదు. మూర్తికే రామరాజ భూషణుడను బిరుద మున్నదని ఐక్యతావాదులు వాదించుచున్నారు. అయినచో మూర్తియొక్క ప్రథమ కృతి వసుచరిత్ర మనుటయు, ద్వితీయ గ్రంథము నరసభూపాలీయ మనుటయు నెట్లు పొసగును? వ్యాఖ్యాతలు ఉభయులను ఒక్కరని భ్రమపడినయట్లే లక్షణదీపికాకారుడును పొరవడినాడు. పురాణనామచంద్రిక మొదలగు గ్రంథములలో ఐక్యవాదము వ్రాయబడెనని శ్రీ శాస్త్రిగారు వ్రాసిరి. దీనిని గురించియే శ్రీ గురజాడ రామమూర్తిగారు వ్రాసిన దానిని శ్రీ శాస్త్రి గారు మరుగు పఱచిరి. వారు వ్రాసినదానినిట పొందు పఱచుచున్నాను.

V పురాణనామ చంద్రికలోను.........

VIII శ్రీరాధాకృష్ణ సంవాదమునందును వ్రాయబడిన సిద్ధాంతములు గతానుగతికములుకాని పరిశీలనా జన్యములుకాని కావు. కావున నిందలి సిద్ధాంతములు పూర్వపక్ష కోటిలోనివై ప్రస్తుతకాలమున నగ్రాహ్యములయ్యెనని గ్రంథస్థమగు సాక్ష్యమునుబట్టి చెప్పవచ్చును. (కవిజీవితములు౩౬౭)

కనుక వానిలో గ్రంథవిస్తరభీతిచే కొన్నిటినిమాత్రమే చూపి అవి ఎటుల అగ్రాహ్యములో నెఱుకపఱతును.

## దక్షిణహిందూస్థాన కవుల చరిత్ర-శాస్త్రిగారి వాదము.

దీనియందును వసుచరిత్రమును రచించినవాడు భట్టుమూర్తియే యని యున్నట్లు శాస్త్రిగారు తమవిమర్శనమున పేర్కొని యున్నారు.

సమాధానము—

దక్షిణ హిందూస్థానచరిత్రము ఆంగ్లమున వ్రాయబడి యున్నది. అందు భట్టుమూర్తిని గురించి విశేషముగనున్నను గ్రంథవిస్తరభయమున ప్రకరణానుకూలమగు నావశ్యక విషయమునే నిట ఉద్ధృత మొనరించుచున్నాను.

### BHATTUMURTI

He in course of time, proceeded to the court of Krishna Raya, who admiring his talents, retained him has one of his eight celebrated bardas; during the life time of his

monarch, he composed an epic poem entitled, "NARASA BHUPALIYAM" or the history of Narasa Bhupal.

After the death of Krishna Rayalu, he wrote another epic poem called 'Vasu Charitra'.

Timma Raju or by title the Bhattu Murti from poetical eminence was one of the poets of Krishna Raya's court. This work was written by him is entitled after the father of Krishna Raya and as usual contains the Geneology of the patron.

భట్టుమూర్తి కృష్ణదేవరాయుల అష్టదిగ్గజములలోని వాడనియు, రాయల జీవితకాలములోనే రాయలతండ్రియగు నరసరాయలపేర నరసభూపాలీయమను గ్రంథమును రచించె ననియు, అందురాయల వంశవృత్తాంతము కలదనియు, ఇతని నిజనామము తిమ్మరాజనియు, కవితాసామర్థ్యమువలన భట్టుమూర్తియను బిరుదము నందెననియు కృష్ణరాయల అనంత రము ఇతడు వసుచరిత్రమును రచించెననియు పయి ఇంగ్లీషు వాక్యములగల సారాంశము.

సమాధానము:—

ఇది యంతయు అసందర్భములతోడను, అసత్యముల తోడను నిండియున్నది. నరసభూపాలీయ కర్తయొక్క పేరు తిమ్మరాజు కాదు. భట్టుమూర్తి అనునది బిరుదమును గాదు. ఇతని నిజనామము మూర్తి. ఇతడు భట్టువంశమునకు జెందిన

వాడగుటచేతను మూర్తియనుపేరుతో కాకమాను మూర్తి యను వేరొకకవి యుండుటచేత వీరిరువుర భేదము దెలియుట కొరకును నతనిని భట్టుమూర్తి అని పిలువ నొడగిరి. ఇతడు రచియించిన నరసభూపాలీయము కృష్ణరాయల తండ్రియగు నరసభూపాలుని పేరగాక కృష్ణరాయల అనంతరము సుమారు నలువది వత్సరములేగిన తరువాత వసుచరిత్ర కృతిభర్తయగు తిరుమల దేవరాయల మేనల్లుడగు నరసరాజున కంకిత మీాబడినది.

తిమ్మరాజనునది భట్టుమూర్తి నిజనామముగాక వసుచరిత్ర కృతిభర్తపేరు. ఇట్టినిజవృత్తాంతమును దక్కన్ చరిత్ర కారుడు పై విధముగ తప్పులు తప్పు తెప్పలుగా వ్రాసి యున్నాడు. భట్టుమూర్తి వసుచరిత్ర వ్రాసెననెడి ఈతని వ్రాత ఎంతవరకు విశ్వసనీయముగ నున్నదో విజ్ఞులు పరికింతురు గాక!

## బ్రౌణ్య నిఘంటువు—శ్రీ శాస్త్రిగారి వాదము:—

బ్రౌణ్యనిఘంటువునందు భట్టుమూర్తి వసుచరిత్రకారుడని వ్రాసియున్నదని శాస్త్రిగారు వచించుచున్నారు.

## సమాధానము:—

సి. పి. బ్రౌను అను పాశ్చాత్య విద్వాంసుడు ౧౯ వ శతాబ్దమున విశేషముగ పరిశ్రమించి ఆంధ్రసారస్వత సేవయందు ముందంజవైచి కొన్ని గ్రంథముల విరచించెను. వానిలో నీ నిఘంటు వొకటి. దానినే తరచుగా బ్రౌణ్యనిఘంటు

వని వ్యవహరింతురు. అందు ఆముక్తమాల్యద పెద్దన విరచిత మనియు, వసుచరిత్ర భట్టుమూర్తి విరచిత మనియు నాతడు పేర్కొని యుండెను. ఇవి రెండును గూడ నసత్యములే. ఇతడీ విషయమున సత్యగవేషణమునకు పరిశ్రమింపక కేవల మానాడుగల జనశ్రుతినే ఆధారముగ గొని వ్రాయుటచే వీరి వ్రాతలను ప్రామాదికము లనవలసి వచ్చుచున్నది.

### పురాణనామచంద్రిక - శ్రీ శాస్త్రిగారి వాదము:—

పురాణనామచంద్రిక యందు భట్టుమూర్తి వసుచరిత్రను వ్రాసినాడను విషయము కలదనుచున్నారు.

### సమాధానము:—

ఇతనికి రామరాజభూషణుడు భట్టుమూర్తి అను రెండు పేరులు గలవు. 'భట్టుమూర్తి' అను బిరుదాంకము కృష్ణరాయలచే ఇతనికి ఇయ్యబడెను. (పు. చంద్రిక. ౧౩౫.) ఈ చంద్రికాకారుడు రామరాజభూషణు డనునది ఈ గ్రంథత్రయకర్త నిజనామ మనియు, భట్టుమూర్తి అనునది కృష్ణరాయ లిచ్చిన బిరుదనామ మని గదా చెప్పియున్నాడు. ఇందలి యాథార్థ్య మేమన భట్టుమూర్తి, రామరాజభూషణు డను నివి రెండును బిరుదములు గాక నామములే. మూర్తి నరసభూపాలీయకర్త యయినట్లును, మూర్తి అనునది వాని నిజనామ మయినట్లును అందలి ఆశ్వాసాంత గద్యములవలన తేటతెల్ల మగుచున్నది. రామరాజభూషణు డనునదిగూడ నామమే గాని బిరుదముగానట్లు వసుచరిత్ర - హరిశ్చంద్ర

నలోపాఖ్యానముల గల గద్యములవలన స్పష్టపడుచున్నది. నరసభూపాలీయానంతరము పయి రెండు గ్రంథములు రచింపబడుటచే భట్టుమూర్తి నరసభూపాలీయకర్త అనియు, రామరాజభూషణుడు వసుచరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానముల కర్త యనియు విశదమగుచుండ భట్టుమూర్తి బిరుదనామమనుటయు, అతడే వసుచరిత్రకారుడనుటయు సత్యేతరములని నిర్ణయమగుచున్నది.

రామకృష్ణుని చాటువు—శాస్త్రిగారి వాదము.

పాండురంగవిజయములోనిదని ప్రసిద్ధి కెక్కినచాటువునందు భట్టుమూర్తి వసుచరిత్రకారుడుగా చెప్పబడెననిశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఆచాటువును క్రింద నుదాహరించుచున్నాను.

సీ. ప్రౌఢ దీర్ఘసమాస పదముల గూర్చి శ్రీ
నాథుండు కూలార్చె నైషధంబు;
దాని తల్లిగ నల్లసాని పెద్దన చెప్పె
ముదిమది దప్పి యాముక్తమాల్య
దూహించి తెలియరాకుండ సూరపరాజు
భ్రమ గళాపూర్ణోదయము రచించె
నతిశ్లేషశబ్దవాగాడంబరం బొప్ప
బస ఘటించెను మూర్తి వసుచరిత్ర
గీ. నిట్టి కవులకు నేను వాకట్టుకొలుపు
జెప్పినాడను మదీయ వైచిత్రి మెరయ

పాండురంగ విజయమును బటిమదనర
విష్ణు వర్థిష్ణుడను రామకృష్ణ కవిని."

ఈ పద్యము పాండురంగమాహాత్మ్యము పీఠికలోనిదందురు కాని ఇది అందెచ్చటను గానరాకున్నయది. ఇదిరామకృష్ణుని చాటువునుం గాదు. ఈ పాండురంగ మాహాత్మ్యము విరూరి వేదాద్రిమంత్రికి క్రీ. శ. 1550-60 లేక 60 వది మధ్య అంకితమొనరింపబడినది. వసుచరిత్ర క్రీ. శ. 1577 వ సంవత్సరమునకు పిదప వ్రాయబడినట్లు శాస్త్రిగారే సెలవిచ్చి యున్నారు. అట్టియెడ మూర్తికి వాకట్టుగ తాను పాండురంగ మాహాత్మ్యమును వ్రాసితిననుట యెట్లుపొసగును? కావున ఈ పద్యము రామకృష్ణునిచే చెప్పబడక చరిత్రజ్ఞానములేని ఎవనిచేతనో వ్రాయబడి రామకృష్ణునిపేర గల్పింపబడినది.

ఇంతియగాక పయిచాటువునందు పెద్దన " ముదిమది దప్పి యాముక్తమాల్యద" చెప్పెననిగదా యున్నది. ఈక్రింది చాటువునుంగూడ నవలోకింపుడు.

"కృష్ణరాయలపేరు నిడి నీవు రచియించి
తివి తొల్త విష్ణుచిత్తీయ మనగ
కాఠిన్య మర్థంబు గ్రాహ్యంబు గాదు సా
ధారణులకని భూధవుడు పలుక
తరువాత మనుచరిత్ర మొనరించి తుత్తమ
కావ్యము మహాద్భుతముగ"

ఈ చాటువు పెద్దన విష్ణుచిత్తీయమును తొలుత రచించి పిదప మనుచరిత్రమును విరచించినట్లు చాటుచున్నది. కావున నిట్లు పరస్పర విరుద్ధముగ నసత్యవిషయముల చాటు చుండు చాటువుల నొక సత్యనిర్ణయమునకు ప్రమాణములు గా భావించి వాని యాధారమును గొనుట పొరబాటనుట దోషమగునా ?

## ఏడ్పు పద్యములు—శ్రీ శాస్త్రిగారి వాదము:—

ఈ పద్యముల విషయమున తెనాలి రామకృష్ణకవి పలికినటుల ప్రసిద్ధమైయున్న "అలసాని పెద్దన యటునిటు నేడ్చెను, ముక్కు తిమ్మన్న ముద్దుముద్దుగ నేడ్చెను, భట్టు మూర్తి బావురని యేడ్చెనను నైతిహ్యము సైతము భట్టు మూర్తియే వసుచరిత్రము రచించినట్లు వెల్లడిసేయు చున్నది. వసుచరిత్రములోని ,,ఆజాబిల్లి,, అను పద్యమును గురించియే రామకృష్ణకవి యిట్టియభిప్రాయమిచ్చెను" అని శాస్త్రిగారు వ్రాసిరి. (వసు. వి. ౯౪.)

## సమాధానము—:—

దీని నిజవృత్తాంత మిది. ఒకానొక రోజున కృష్ణదేవ రాయలు పండితుల జూచి పెద్దన, తిమ్మన, భట్టుమూర్తుల కవితా విశేషము లెరిగింపుడని కోరి, ఆయా కావ్యములగల నాయికల నేడ్పుపద్యములగు "పాటునకింత లోర్తురె" యను మనుచరిత్ర పద్యమును, "ఈసునబుట్టి డెందమున" అను పారిజాతాపహరణ పద్యమును, "ఆజాబిల్లి వెలుంగు వెల్లి

కల" అను వసుచరిత్ర పద్యమును పేర్కొని—స్వామీ! నాకుజూడ నలసాని పెద్దన యిటునిటు నేడ్చె, ముక్కు తిమ్మన్న ముద్దుముద్దుగ నేడ్చె, భట్టుమూర్తి బావురని యేడ్చెనని రామకృష్ణుడనెనట. ఇది చాటు పద్య మణిమంజరి యందుగలదు. (౧౮౭ పుట)

ఇది రాయల సభలో జరిగినది మాత్రము కాదు. చారిత్రకజ్ఞానవిహీను డెవ్వడో దీనిని కల్పించి యుండును. ఏలనన కృష్ణరాయల కాలమునకు వసుచరిత్రము రచింపబడియే యుండలేదు. కావున పైనుదహరింపబడిన యైతిహ్యమెంతవరకు సత్యమో పండితులే యాలోచింతురుగాక.

ఎన్నివిధములనాలోచించినను శ్రీశాస్త్రిగారు ఐక్యతావాదమున కొసగిన ప్రమాణములన్నియు ప్రమాదములే యయినట్లు సోపపత్తికముగా ఋజువగుచున్నదిగదా!

మరికొన్ని చాటువులు—

పైన పేర్కొనిన నసంబద్ధములగు ప్రాచీనుల చాటువులవలెనే మరికొన్ని చాటువులు కూడ వీరిని గురించి కలవు. ఛందోబద్ధమైనది యంతయు ప్రమాణమే యగునా? ప్రాచీనులవి యయినంతమాత్రమున పూర్వాపరసందర్భములు సరిపడియున్నది-లేనిది విచారింపకయే అదియే వేదవాక్యమని విశ్వసింపవలయునా? ఈ క్రింది చాటువులం గూడ జూచిన వీనియందలి అసంబద్ధత్వము గోచరమగును.

“ తా రచించిన వసుచరిత్రమున గన్న
తండ్రి సూరన వెలయించి తలపడయ్యె
నన్ను మన శారదామూర్తి నాఫలంబె
దత్తుడగువాని జేపట్టదరమె నాకు?”

ఈ చాటువు వలన శారదామూర్తిని గురించి (ఇతని పేరు శారదామూర్తిగాక కేవలము మూర్తియే.) పెంపుడు తండ్రియగు వేంకటరాయభూషణుడు వసుచరిత్రమున మూర్తి తన జనకపితయగు సూరపరాజుపేరు నుదాహరించి, తనపేరు నుదాహరింపక పోవుటచే వాపోయెనని తెలియుచున్నది. ఇది యెంతయు నసత్యము. వసుచరిత్రమున రామరాజభూష ణుడు తన తండ్రి పేరుపేర్కొ—ననే లేదు.

“ అసమసాహిత్యరసమును వసువుపాలు
జేసి తత్పోషణార్థంబు వాసి నరస
రాజు నుద్గతి భజియించి రామరాజు
శివపదముజేరె పేరును భువిని విడిచి”

ఇందు వసుచరిత్రానంతరము రామరాజభూషణుడు నరసరాజు నాశ్రయించి నరసభూపాలీయమును రచించి శివైక్యము పొందెనని చెప్పబడుటచే నిదియు నసత్యమే. వసుచరిత్ర రచనానంతరము నరసరాజును రామరాజభూషణు డాశ్రయింపను లేదు. నరసభూపాలీయమును రచించెననుటయు కల్లయే. ఇతడు రామభక్తుడుకాన శివైక్యమునందె ననుటయు నసంబద్ధమే. ప్రకరణజ్ఞానము లేని శైవుడెవ్వడో ఈపద్యమును కల్పించి యుండనోపును.

ఇటులనే ప్రాచీను లొనరించిన ప్రమాదములెన్నియే నియుం గలవు. ఇట్టివే ఆముక్తమాల్యద-వసుచరిత్ర వ్యాఖ్యానముల నవతారికలుగా నవతరించి, అలజడి కలిగించుచు సత్యమును మాటుపుచ్చుచున్నవి.

## శ్రీ వీరేశలింగముపంతులుగారి వాదము—

పూజ్యులు, ఆంధ్రులకు చిరస్మరణీయులు నగు రావు బహదూర్ కందుకూరి వీరేశలింగముపంతులుగారు పైజెప్పబడిన రెండు చాటువుల నాధారముగ గొని మూర్తికి "శంభ" యను బిరుదనామము గలదనియు, ఇతనికి వేంకటరాయ భూషణుడను పాలకపితయు, సూరపరాజను జనకపితయు నుండిరనియు వసుచరిత్రానంతరమే నరస భూపాలీయము రచింపబడెననియు వ్రాసియున్నారు.

ఈ వాదమును భిన్నవాదులగు శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారును, ఐక్యతావాదులగు శ్రీ శాస్త్రిగారును ఖండించి యుండుట నేను దీనిని మరల పిష్టపేషణమని పరామర్శింపక విడిచిపుచ్చుచున్నాను.

## శాస్త్రిగారి అభిమాన స్వభావములు.—

శ్రీ శాస్త్రిగారి వాదమును విమర్శించుటకుపూర్వము వారి అభిమానస్వభావాదుల నెరుంగుటయునవసరము, న్యాయమునగును. ప్రతి పండితునకును నొక కవిపయి ప్రత్యేకాభిమానముండుట మనకు పరిపాటియయినవిషయము. నూతన పథమున పండితపామరరంజకముగ కవితావసంతమును విరియిం

చుటయేగాక, తెలుగునేల నాలుగుమూలల తామరతంపరగ శిష్యప్రశిష్యకోటిని వెలయించిన ఉద్దండకవిపండితులగు శ్రీ వేంకటశాస్త్రిగారు నన్నయను మేలినాణెము సేయుదురు. అఖండప్రతిభావంతులును, కవిత్వతత్త్వవిచారపారంగతులునగు శ్రీకట్టమంచివారు కావ్యకర్తలందు పింగళి సూరన్నకు పట్టము గట్టుదురు. ప్రాత-క్రొత్తల మేలుకలయికతో కమ్మదనమును వెదజల్లుచు కవితకు గైకోలుఎత్తిన శ్రీ తుమ్మలవారికి తిక్కన యన్న తరితీపులు మెండు. పరిశోధకాగ్రసరులగు వేటూరి వారికి కవిసార్వభౌములపయి మక్కువ ఎక్కువ. వాడుక భాషను వాడుక చేయుటయందును, కవిహృదయపు లోతుపాతులను కొలుచుటయందు కడునేరుపరులగు శ్రీ తాపీవారికి చేమకూరపాకమన్న అభిరుచి హెచ్చు. పండితవిమర్శకులగు శ్రీ శాస్త్రులవారికి రామరాజభూషణుడే రంజకుడు. ఈతని పయి వీరికిగల గాఢాభిమానమునకు హరిశ్చంద్రనలోపాఖ్యానపు విపులపీఠికయు, వసుచరిత్ర విమర్శనమును ప్రబలతార్కాణములు. పెద్దనకవికన్న రామరాజభూషణుడు వివిధకవితావైఖరుల పెద్దరికముగన్నవాడని వసుచరిత్రవిమర్శనమున వీరు ఎలుగెత్తి పలికియున్నారు. 'భిన్నరుచిర్హి లోకః' అనుసూక్తియే వీనికన్నిటికిని శ్రీరామరక్ష.

శ్రీ శాస్త్రిగారి శీలము నించుకపరామర్శింతము. వీరు రామరాజభూషణునియందుగల ప్రత్యేకాభిమానముతో తమ పాండిత్యప్రకర్షచేతను, శక్తియుక్తులచేతను పెక్కుస్థలములందు పద్యములకు వేరువేరు భావములను జూపించిరి. ఈమాత్రమే

గాక కొన్ని సాహసములగూడ ప్రదర్శించిరి. మచ్చునకు కొన్నిటి గాంచుడు.

„నైషధమున శ్రీనాథుడు సకలవిద్యాసనాథ శ్రీనాథ భట్టయియుండియు, హరవిలాసములో వినయవిధేయ శ్రీనాథ నామధేయుడై యున్నాడు. ఇతనికి ప్రసిద్ధములైయున్న కవిరాజు, కవిసార్వభౌముడు అను బిరుదము లాతని గ్రంథములం దెందునుగానరావు„ (౧౧-౧౨ పుట.)అనిశాస్త్రిగారు చాల సాహసముగ వ్రాసియుండిరి. ఇందలి యాథార్థ్యము నించుక విశద మొనరింతును.

శ్రీనాథుడు కాశీఖండమును విరచించుటకు నించుక పూర్వమే కవిసార్వభౌముడను బిరుదమును పొందెను. అందు ఆబిరుదమును ఆహ్లాద పూర్వకముగ నుపయోగించినాడు.

"ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు.........

కవి సార్వభౌమ" ౧ఆ. ౧౪ప.

"కర్ణాట క్షితి పాల మౌక్తిక సభాగారాంతరాకల్పిత
స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్య చారిత్ర."

౭. ఆ. ౨౬౪. ప.

ఇట్లు ఉపక్రమోపసంహారములందేగాక ప్రతి ఆశ్వాసాంతగద్యమునందును ఈవిధముగ గలదు."........కవి సార్వభౌమ శ్రీనాథ నామధేయ ప్రణీతంబైన కాశీఖండము నందు..........„

ఇట్లు స్వాభిమాన పారవశ్యముతో తన కవిసార్వభౌమ బిరుదమును ఆంధ్రులెల్లరు సంతోష గర్వముల తన్మయత జెందునట్లుగా చెప్పుకొనియున్న ఉపక్రమోప సంహార పద్యములను శాస్త్రిగారు గమనింపలేదందుమా ! సంస్కృతాంధ్ర వాఙ్మయములు రెండును వీరి పుక్కిటనున్నట్లు వసుచరిత్ర విమర్శము ఋజువుసేయు చున్నది. అయిన శాస్త్రిగారు కాశీఖండమును జూడలేదందుమా; అదియుపొసగుబాటు కాదు, "నైషధాది మహా ప్రబంధములు పెక్కు చెప్పినాడ,,నని కాశీఖండమునసుండుటచే (వసు. విమ ౮౧ పు.)అనియు నుదాహరించియున్నారు. ఇటుల కాశీఖండమును జూచియు శ్రీనాథుడు తన కవిసార్వభౌమ బిరుదును తన రచనలలో చెప్పికొనియుండలేదనుట ఏలనో ఊహింపరాకున్నది.

వీరి వసుచరిత్ర విమర్శనమునకు పూర్వమే వావిళ్ళవారు నరసభూపాలీయమును సంస్కరించి ముద్రించియుండిరి. అందు ఎఱ తిమ్మరాజును గురించి చెప్పిన "తన భుజాదండ" అను ౮౪ వ పద్యమునకు అవకాశము కొలంది తమ వాదమునకు అనుకూలముగ నుండు విధమున "ప్రాభవోపేంద్రుం"డని యున్న దానిని "ప్రాభవోపేతుం"డని మార్చి వైచిరి. రామమూర్తిగారు వ్రాసినదాని నెటుల మరుగు పఱచినది లోగడనే వ్రాసియుంటిని. ఇటుల తమ వాదమునకనుకూలముగ నుండగలందులకు పలుచోట్ల నిజమును మరుగు

పఱచి అభిమానమును జూపించిరని మిక్కిలివిచారమునవ్రాయుట తప్పుచున్నదికాదు. ఇట్టిమార్పు చేర్పులతో అభిమాన పూరితులై మూర్తిని రామరాజభూషణునిగా పరివర్తనము జేయ శ్రీశాస్త్రిగారు నడుముబిగించిరి.

రామభూషణుని స్వభావము:—

మూర్తి రామభూషణుల భిన్నత్వమును నిర్ణయించుటకు ముందు రామరాజభూషణుని స్వభావముంగూడ దెలిసికొనుట యవసరమగును. ప్రతి కవియు ప్రాచీనకవుల పదజాలమును, అభిప్రాయములను స్వరచనమున కొలదిమార్పులతో నుపయోగించు కొనుచుండును. ఇది సహజము, నవిలంఘ్యము నయిన సంగతి. "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" అని ప్రఖ్యాతిగాంచిన భవభూతిగూడ, కాళిదాసుని భావముల నుత్తరరామచరిత్రమున నుపయోగించుకొని యుండెను. డిండిమభట్టు కంచు ఢక్కను పగులగొట్టించి, కవిసార్వభౌమ బిరుదమునందిన శ్రీనాథుడు సైతము సంస్కృత కావ్యములందలి భావములనే గాక సమాస పదములగూడ తన రచనములగూర్చి యుండెను. దీనికి శృంగార నైషధమే ప్రబల సాక్ష్యము. దీని ననుకరించుచు పినవీరభద్రుడు శృంగార శాకుంతలమును రచించియుండెను. ఈ రెంటి ననుకరించుచు "మారన" మాటలతోడనే పెద్దన మనుచరిత్రమును సృష్టించెను. రామరాజభూషణుడు పెద్దనను విశేషముగ ననుకరిం

చుటయేగాక ఇంతవరకేకవియు ననుకరింపనివిధమునగూడ ననుకరించి యుండెను.

ఇతని వసుచరిత్రమునుబట్టి బయలుదేరి పిల్లవసుచరిత్రములనబడుచున్న కవిజనరంజనములో మూడు, కవిరాజమనోరంజనములో ఎనిమిది, శకుంతలాపరిణయములో పదుమూడును అనుస్మృతులు గలవు. (వసు. వి. ౬౮. పుట).

ఇక ఇతని వసుచరిత్రములో శృంగారనైషధము, శృంగారశాకుంతలము, మనుచరిత్రములలోని అనుస్మృతులు నూటరెండుగలవు. (వసు. వి. ౨౯. ౩౩.) ఇంక నరసభూపాలీయానుస్మృతులు పదిగలవు. ఇంతియగాక సంస్కృతాంధ్రగ్రంథములలోని అనుస్మృతులుపెక్కు గలవు.

ఇతడు రచించిన ద్వ్యర్థికావ్యమగు హరిశ్చంద్రనలోపాఖ్యానమునందును మనుచరిత్రము, విష్ణుచిత్తీయము మొదలగు గ్రంథములందెన్నియేవియును అనుస్మృతులు గలవు.

ఇతడఖండ ప్రతిభావంతుడే గాని అనుకరణప్రియుడు. "ఇతరకవులు వర్ణించినవర్ణనములను మెరుగుపెట్టుచు పద్యములను రచించుటయు నీతనికి స్వభావమే యయి యున్నది." (హ. న. పీ. ౧౬౯.) అనిశాస్త్రిగారు రామరాజభూషణుని స్వభావమునకిట్లు మెరుగుపెట్టిరి. వసుచరిత్రకారునివలె అనుకరించినకవులు అరుదని గుర్తించుకొనినగాని వీరి భిన్నత్వము సరిగా గ్రహించుటకు సావకాశముండదని మనవి.

ఐక్యతావాదమునకుగల కారణములు:—

"ఉభయుల కవిత్వపుజాడలు నొకజాతిగ నుండుటచేతను,(వసు. వి. ౫౪-౫౫) నరసభూపాలీయములోని పెక్కు పద్యముల కల్పనములు వసుచరిత్రమున జమత్కరింపబడి యుండుటచేతను,(వసు. వి. ౬౦-౭౦.) నరసభూపాలీయములోని పద్యములే రెండు వసుచరిత్రము నందును నుపయోగించుకొనబడి యుండుటచేతను, (వసు. వి. ౫౫-౭౧.) నరసభూపాలీయ,వసుచరిత్రములలోని గ్రంథారంభ సందర్భ మొక్కరీతిగనే యుండుటచేతను,(వసు. వి. ౬౬-౬౭-౬౮.) నుభయకవులును హనుమత్ప్రసాద లబ్ధకవితా వైభవులే యగుటచేతను, కవికృత గ్రంథత్రయమునందును గవియొక్క సంగీత రహస్య కళానిధిత్వమును వెల్లడించు సంగీతశాస్త్రవిషయిక వర్ణనములు వెలయుచుండుటచేతను, (వసు. వి. ౨౭౮.) నుభయులు చెప్పిన ప్రజ్ఞలయందును వైధర్మ్య మేమాత్రము కానరాకుండుటచేతను, వీరిరువురు నొక్కరేయను వ్యవహార మనుశ్రుతముగా ప్రసిద్ధమై యుండుటచేతను, కొన్ని లక్షణ గ్రంథములందు వసుచరిత్రము నందలి పద్యముల నుదాహరించునపుడవి భట్టుమూర్తి కవికృతములని అందు వ్రాయబడి యుండుటచేతను, (వసు. వి. ౫౬-౫౭, ౭౫-౭౬.) గ్రంథత్రయమునందు కవితారీతి ఏకరీతిగ నుండుటచేతను (వసు.వి. ౨౪౪.) వసుచరిత్ర హరిశ్చంద్ర నళోపాఖ్యానములకు కర్త

యొక్కడేయని కొందఱి యభిప్రాయము" (హరి. న. పీఠిక. 3.) అని శాస్త్రిగారు వ్రాసియున్నారు.

ఇన్ని కారణముల గుదిగ్రుచ్చి శ్రీ శాస్త్రిగారు మూర్తి రామరాజభూషణు లొక్కరేయను అంధప్రాయముగా, ననుశ్రుతముగా వచ్చువాదమును బలపఱచుటకు వ్రాసినదియే కాని అందు సత్యనిర్ణయమునకు చాలగలిగిన సారమేమియు లేదని మనవిచేయుటకు విచారపడుచున్నాను. వీరు స్వవాదస్థాపనముకొఱకు ఒకేవిషయమునకు భిన్నభిన్ననామముల నిడి తమ యుక్తివాదకౌశల్యమును ప్రదర్శించిరి. ఇందలి యాథార్థ్యమును పాఠకులు నారయ గలుగుటకు ఆనుపూర్వకంగ నొక్కొక్క విషయమును చర్చించి చూపింతును.

**ఉభయుల కవిత్వపుజాడల నేకజాతి-**

"ఉభయుల కవిత్వపు జాడలు నేకజాతిగానుండె" నని గదా శాస్త్రిగారి వాదము.

సమాధానము—

భట్టుమూర్తి, రామరాజభూషణుల రచనము లందు కొన్ని పోలికలు గలవనుట నిక్కవమే. వీరిరువురును అన్నదమ్ముల బిడ్డలగుట నీపోలిక సహజమే యగును. ఇట్టిపోలికలు వీరియందే గాక భిన్న భిన్న వ్యక్తులని నిస్సందేహముగ నిర్ణయమయిన వారియందుగూడ నిట్టి పోలికల పోకడలు పరిపాటియై యుండుట బహుగ్రంథద్రష్టలగు శ్రీశాస్త్రిగారికి క్రొత్తయా? శ్రీనాథుని కవితావైఖరులను నాతని సమకాలికులగు

జక్కన విక్రమార్కచరితమందును, పినవీరభద్రుడు శృంగార శాకుంతలమునందును, వినుకొండ వల్లభామాత్యుడు క్రీడాభి రామమునందును పలుచోట్ల ననుకరించియుంట సోదాహరణ ముగ గానవచ్చుటలేదా ? కావున సమకాలికులైన కవుల యందే అనేకులు ఏకజాతికవిత్వము చెప్పియున్నట్లు తెలియు చున్నది. అందు రామరాజభూషణుడు ఎక్కుడు అనుకరణ ప్రియుడు. నరసభూపాలీయము లక్షణగ్రంథమగుట నేటిపరీ క్షావిద్యార్థులవలె నతడును పలుమారులు ఆవృత్తి చేసియుండ వచ్చును. అందువలన నా కవిత్వపుపోకడలే నతని కవిత్వము గూడ సప్రయత్నముగనో - సప్రయత్నముగనో ప్రతిఫలింప వచ్చునేగాని అంతమాత్రమున మూర్తియే రామరాజభూష ణుడనుట పొసగనేరదు.

## పద్యముల చమత్కరించుట:—

"నరసభూపాలీయమునందలిపద్యములనే అతడు పలు చోటుల చమత్కరించియుండె" నని శాస్త్రిగారు వ్రాయుచు న్నారు.

## సమాధానము:—

ఒకరినొకరు అనుకరించుచు, తమ పద్యములకు మెరు గుపెట్టుకొనుచలవాటు హెచ్చుగ కవిసాంప్రదాయములగాన వచ్చుచున్నది. "ఇతరకవులు వర్ణించినవర్ణనములను మెరుగు పెట్టుచు పద్యములరచించుట నీతనిస్వభావమే యైయున్నది." (వా. న. పీ. ౨౬౯) అని శాస్త్రిగారు రామరాజభూషణుని

స్వభావమునుగురించి వ్రాసియుండిరి. కావున రామరాజభూషణుడును నరసభూపాలీయములోని పద్యములను అనుకరించియుండెనేగాని అంతమాత్రమున ఇతని నే మూర్తియనుటయెట్లు పొసగును? అనేక గ్రంథములలోని పద్యములనుగూడ ఇతడనుకరించియుండెనుగదా!

## పద్యముల రెంటినుపయోగించుట-

అనేక గ్రంథములను రచించిన కవులు సమానవర్ణములు వచ్చెడి పట్టుల దాము మొదటరచించిన గ్రంథములలోని పద్యములను జేకొని ఆవశ్యకములయిన మార్పులను జేసి తరువాత రచించెడి గ్రంథముల చేర్చుకొనెడియాచారముగలదనియు, తిక్కన సోమయాజి తన నిర్వచనోత్తరరామాయణమునుండి పద్యముల రెంటిని తనభారతరచనమున నుపయోగించెనని ఉదాహరించినట్లు రామరాజభూషణుడును నరసభూపాలీయములోని రెండుపద్యములను వసుచరిత్రములోనుపయోగించుకొనెనని శ్రీవీరేశలింగముపంతులుగారు వ్రాసినట్లు శ్రీ శాస్త్రిగారు వ్రాసియున్నారు. (వసు. వి. ౭౩)

## సమాధానము;—

తిక్కనవలె ఒకచో వ్రాసినపద్యములను తమ అన్యగ్రంథములందు వాడుకొనుటయే గాక ఇతర కవుల పద్యములనుగూడ తమగ్రంథముల వాడుకొన్నవారును గలరు. ఇట్టివారిలో ప్రథమమున పరిగణింపదగినవాడు గణపవరపు వెంకటకవి. "లాక్షణికులలో నితడగ్రగణ్యుడు. మంచిపండితుడు

 

ఈతడు శతాధికగ్రంథములు వ్రాసియుండును.'' అని ఈకవిని గురించి శతకవులచరిత్ర-(౧౬౯ వ పుట)లో గలదు.

ఇట్టి లాక్షణికాగ్రగణ్యుడు

" ఔరా ! యోజనృపాల కు
మారా! మను మదనసమ రమాధుర్యుఁడవై
ధీరా! నృసింహ కూడితి
మారా! మనుమదనసమరమాధుర్యుడవై''

అను నీ నరసభూపాలీయమునందలి పద్యమును

" ఔరా! మాధవయజ్వకు
మారా! మను మదనసమ రమాధుర్యుడవై
ధీరా! విటార్య యేలితి
మారా! మనుమదనసమ రమాధుర్యుఁడవై ''

అని పేర్లుమాత్రము మార్చి తన వెంకటేశ్వరవిలాసములో వ్రాసికొనెను.

కవిసార్వభౌముడగు శ్రీనాథుని హరవిలాసములోని—

"ఎంచి నుతింపశక్యమె యహీశ్వరునంతటివానికైన ర
త్నాంచిత రోచిరుద్గమ నిరస్తసమస్త రవీంద్రుజాలమున్
గాంచన కందరాయ వనికాయత వారి ధరాంతరాళ ని
ర్వంచిత దేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్.''

అను నీపద్యమునే శ్రీనాథునకు సమకాలికుడగు పిన వీరభద్రుడు యథాతథముగ తన శృంగారశాకుంతలమున ప్రయోగించుకొనెను.

"కుదురుమెరుంగు నిబ్బరపుగుబ్బలపై నయనాంబుపూరముల్
చెదరగ నేలయేడ్చెదవు చెల్వ! దురంతవిషాదవేదనా
విదళిత మానసాబ్జవయి వేమరు నాయువు శాశ్వతంబె సం
పదలు స్థిరంబులె విధివిపాకము దాటదరంబె యేరికిన్."

ఈ పద్యము రామరాజభూషణుని హరిశ్చంద్రనలో పాఖ్యానమునందును, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమునందును కలదు. వీరిరువురుసమకాలికులే గాక శంకరకవిఅష్టదిగ్గజములోనివాడని కొండవీటి దండకవిలె చెప్పుచున్నది. వీరిరువురును అల్పకవులుగారనువిషయము విద్వల్లోకమునకు సువిదితమేగదా! వీరిరువురిలో నీపద్యమును తొలుత రచించినవానిని నిర్ణయించుట దుర్లభముగదా? అయినను వీరిలో నొకరు ఆ పద్యమును చౌర్యము చేసియుండిరనియనక తప్పదుగదా!

"గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకు మూనుటయది బృహస్పతి మతంబు
విప్రజన వాక్యమరయంగ విష్ణుమతము
సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతమగు"

శ్రీనాథుని భీమఖండములోని యీ పద్యమును నితని సమకాలికుడగు వినుకొండవల్లభరాయుడు క్రీడాభిరామమున నించుక మార్పుతోనిట్లు వ్రాసికొనెను.

"గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన
శకున మూనుటయది బృహస్పతి మతంబు

వ్యాసమతము మనః ప్రసాదాతిశయము
విప్రజన వాక్యమరయంగ విష్ణుమతము”

ఇట్లు ఆంధ్రవాఙ్మయమున నొకరిపద్యమును వేరొక రుపయోగించుకొనినవారు పెక్కురుగలరు. అటులనే మూర్తి పద్యములనుగూడ రామరాజ భూషణుడుపయోగించుకొనె ననుట నిర్వివాదాంశము.

“నరసభూపాలీయములోని పద్యములే రెండు వసుచరిత్రమునందు నుపయోగించుకొనబడుటచేతను” (హా. న. పీ. 3.) అని శాస్త్రిగారు వ్రాసిరి. ఇది ఎంతసత్యమో ఎఱుకపఱతును.

“ఆమోదంబున శ్రీనృసింహవిభు దానాంభోనదుల్ సాగర
స్వామిన్ జెంద యశంబు మేఘముల బర్వంగల్గు వర్షాశర
త్సామానాధికరణ్య లబ్ధికచటన్ దామోదరుండొందు ని
ద్రాముద్రానుగత ప్రబోధముల జిత్రంబేక కాలంబునన్.

అను నరసభూపాలీయము నందలి పద్యమును

“రామక్ష్మావరు దానతోయతటినీ వ్రాతంబు కల్లోలినీ
స్వామిన్ జెంద యశంబు మేఘముల బర్వంగల్గు వర్షాశర
త్సామానాధికరణ్య లబ్ధికచటన్ జక్రాయుధుండొందు ని
ద్రాముద్రానుగత ప్రబోధముల జిత్రంబేక కాలంబునన్.”

అని మార్చి వసుచరిత్రకారుడు తన రచనమున నుపయోగించుకొనెను.

"గంగం దాల్చితి వుత్తమాంగమున నన్ గైకోలుగావించి త
ద్ధాంగీకారమనర్ బురంధ్రి!నినువామాంగంబునన్ దాల్పనే
శృంగారోన్నతి జూడుమంచు గిరిజన్ శీర్షాపగా బింబిత
స్వాంగానందిత జేయు శంభుడు నృసింహోర్వీశ్వరుం బ్రోవుతన్"

అను నీ నరసభూపాలీయమునందలి పద్యమును

"ఆమందాకిని మౌళి బూనినను నర్ధాంగీకృతుం జేసి తౌ
నా మేల్మేలనియార్యయల్గ బణతుండై తత్పదాంభోజ యో
గామర్షంబునగంగయున్మొరయ జూడాభోగసమ్యక్క్రియా
సామర్థ్యంబున వేడు శంభుడుకృతిస్వామిన్ గృపన్ బ్రోవుతన్."

అని భావమునకు క్రొత్తరూపునిచ్చి చమత్కరించెనే గాని శాస్త్రిగారు చెప్పినట్లు యథాతథముగ ప్రయోగించుకొని యుండలేదు.

ఇక ఈ కవి వతంసుని పదార్థచౌర్యమునుగూర్చి ఒకింత పరీకింతము. గుడిమ్రింగువానికి గుడిలోని లింగమొక లెక్కయా! పద్యములకు పద్యములే ఉపయోగించుకొను వానికి పదార్థ చౌర్యమననేపాటి ? దీనిని చౌర్యమనియే యన సాహసించి నచో రచనమునకు కలము కాగితము బట్టినవారి నందరను నట్లే లెక్కింపవలయునుగదా! "బాణోచ్ఛిష్టమిదం జగత్" అనిగదా పెద్దలసూక్తి.

ఒకే గ్రంథమును అనేక కవులు రచించి నపుడును, నొకే ఘట్టమును వర్ణించునపుడును ఇట్టిపోలిక లెన్నియేనియు కలిగియుండును. నాచన సోముని ఉత్తర హరివంశమున నర

కాసుర సంహార ఘట్టమును ఆదర్శముగా పెట్టుకొని పోతన తన భాగవతమునందలి నీ భాగమున ననేక పద్యములు రచించియుండెను. ఈక్రింది పద్యమున విస్పష్టముగ గానవచ్చు పోలికను గాంచుడు!

“అరిఁజూచుఁ హరిఁజూచు జూచుకములందందందమందార కే
సరమాలామకరంద బిందుసలిలస్యందంబులందంబులై
తొరగఁ బయ్యదకొంగొకింతతొలగఁ దోర్దోశ్శరాసారముఁ
దరహాసామృతపూరముఁ గురియుచుం దన్వంగి కేళీగతిన్

(నాచనసోముని ఉత్తరహరివంశము.)

“పరుఁజూచున్ వరుఁజూచునొంప నలరింపన్ రోషరాగోదయా
విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్
జరగన్ గన్నులఁగెంపుసొంపువరగంజండాస్త్రసందోహమున్
సరసాలోకసమూహముం నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.”

(పోతన భాగవతము)

ఇటులనే నన్నయభట్టరచితమగు భారత భాగమునందలి:—

“రయవిచలత్తురంగమ తరంగములన్ మదనాగ నక్రసం
చయముల సంచలచ్చటుల సైనికమత్స్యములన్ భయంకరం
బయినయదువృష్ణి భోజకుకురాంధక వాహినియుంగలంగె ని
ర్దయతర రోషమారుత నితాంతసమీరితమై క్షణంబునన్”

సభాపర్వము. ద్వితీయాశ్వాసము. ౮౩

అనునీపద్యమును నన్నయ పేరుతోడనే ఆరణ్యపర్వశేషమును “తత్కవితారీతియుగొంతదోప” పూరించి,నన్నయ

నొరవడిగా పెట్టుకొనిన ఎఱ్ఱాప్రగ్గడ తన భారతారణ్య రచ
నమున—

"రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగ నక్రసం
చయములజంచలచ్చటుల సైనికమత్స్యములన్ మహోన్నతం
బయి కురురాజచంద్రు నుదయంబున దద్దయు బొంగె బ్రస్ఫుర
ద్భయదమనోహర ప్రకటభంగుల దద్భటవార్థియుద్ధతిన్

ఆరణ్యపర్వము. షష్ఠాశ్వాసము. ౨౮౮. ప.

అని మార్చుకొనియుండెను.

ఇటులనే శంకరకవి హరిశ్చంద్రో పాఖ్యానమునందలి పద్యములనుపోలి కంచివర శరభకవి హరిశ్చంద్రోపాఖ్యానము నందు పద్యములెన్నియేని గలవు. మచ్చునకొకటి గాంచుడు!

"అకటా! చేరెడు నేలకుందగడె సప్తాంభోధివేష్టిభవ
త్సకలద్వీపకలాపభూపమకుటాంచత్పద్మరాగోజ్వల
ప్రకటానర్గళనిర్గళత్కిరణశుంభత్పాదుడైనట్టి రా
జకుమారుండనియేడ్చె కన్నుగవ నశ్రుల్ కాల్వలై పారగన్"

(శంకరకవి.)

"సప్తద్వీప సముద్రముద్రిత మహాసర్వంసహాచక్ర సం
ప్రాప్తశ్రీకమనీయలక్షణ జగత్ర్వ్యాపిణ్య సత్యవ్రతో
ద్దీప్త ప్రాభవుడైన రాజసుతుడద్ధిన్ దైన్యభావోదయ
వ్యాప్తిన్ బెత్తెడు నేలకైన దగడేయంచున్ విలాపించుచున్."

(శరభకవి)

శంకర, శరభకవు లిరువురును సమకాలికులు, సమర్థులును. అనుకరణములు మనగ్రంథముల ఇట్టివెన్ని యోగలవు. కాని గ్రంథవిస్తరభీతిచే వానినన్నిటి నుదాహరించుట విరమించుకొంటిని.

ఈ అనుకరణపు పూర్వాపరసందర్భముల బట్టి కవుల యొక్క మహాత్వాల్పత్వములు స్పష్టము లగుచుండును. అసమర్థుడు సమర్థుననుకరించునుగాని సమర్థుడు అసమర్థుని ననుకరింపడుగదా! ఈసూత్రము నాధారముగాగొని మూర్తికవి కంటె రామరాజభూషణుడు సర్వవిధముల ప్రౌఢకవి గదా! ప్రౌఢుడగునతడు అప్రౌఢుడగు మూర్తిని అనుకరించుట అసంభవముగాన వీరుభిన్నులుగాక అభిన్నులని శాస్త్రిగారందురు. కాని వాస్తవముగ మూర్తికవియు నప్రౌఢుడుగాడు. ఈతడు తన కవితానైపుణ్యమును స్వరచనమున తానేప్రకటించుకొని యుండెను. అదిచూచిన ఇందలి యాథార్థ్యము పాఠకులకే బోధపడును.

"...ఈతని కవితాధార దివిజగంగాప్రవాహముంబోలి యనివార్య విజృంభణము గలదియై పెంపొందుచున్నది. ......"
ఈ కవియే తన కవితామహిమనుగూర్చి యిటుల గంభీరముగ నుడివికొనియున్నాడు.

"బాణవేగంబును భవభూతి సుకుమార
తయు మాఘుశైత్యంబు దండి సమత

యాలమయూరు సువర్ణకలన చోరుని యర్థ
సంగ్రహమ్ము మురారి కయ్యసేర్పు
సోముప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్రముఖదృష్టి
నీక కలదటుగాన ననేకవదన
సదనసంచారఖేదంబు సడలుపఱచి
భారతీదేవి నీజిహ్వ బాదుకొనియె
మూర్తికవిచంద్ర విఖ్యాతకీర్తిసాంద్ర”.

“ఇది యతిశయోక్తి యని తలపరాదు. చెప్పినట్లు చేయుట సామాన్యముగ నందఱకు నలవిగాని పనియేకాని యీతడట్లు చేయజాలినవాడని సులభముగా దోచును”

నరసభూపాలీయపీఠిక. III IV పుటలు.

కనుక తిక్కనవలెగాక పైన పేర్కొనిన యితర కవుల వలెనే రామరాజభూషణుడును సంగ్రహించెను.

గ్రంథారంభ సందర్భము—

“నరసభూపాలీయ వసుచరిత్ర గంథారంభము లొక్క విధముగనే యున్న”వని శాస్త్రిగారి వాదము.

సమాధానము:—

ఈ గ్రంథద్వయ ప్రారంభ సందర్భము లొక్కరీతిగనే యుండుటచే ఈ గ్రంథముల రచించినవాడొక్కడేనని శాస్త్రి

గారు వ్రాసియున్నారు. ఇది యుక్తియుక్తము కాదు. శ్రీనాథ కవి సార్వభౌముడు, పింగళి సూరనార్యుడు మొదలగు కవి గ్రామణులు ఒక్కొక్కరే పెక్కు కావ్యములను వ్రాసియుండిరి. కాని వాని ప్రారంభఘట్టములు ఒకదానితో నొకటి యెట్టి సాదృశ్యమును కలిగియుండలేదు. ఆ మాత్రమున నా గ్రంథముల విరచించినవారు భిన్న భిన్నులని వచియింపగలమా? వేయేల? రామరాజ భూషణుడే రచించిన వసు చరిత్ర, హరిశ్చంద్ర నలోపాఖ్యానముల గ్రంథారంభములే సాదృశ్యమును కలిగియుండలేదు. కావున నీ సాధర్మ్య-వైధర్మ్యములబట్టి కవుల భిన్నత్వా భిన్నత్వములు నిర్ణయించుట ప్రమాదకరము- హేతుశూన్యమునగును.

దుష్టతోష న్యాయముగ ఆసమర్థనము నంగీకరించి, ఆ గ్రంథముల ప్రారంభఘట్టములు సాధర్మ్యమును కలిగియుండెనో లేదో విచారింతము.

నరస భూపాలీయకవి ప్రథమమున త్రిమూర్తిస్తోత్రము నారంభించి, వారితోబాటు వారిదేవేరులగు లక్ష్మీ సరస్వతులను మాత్రము స్తుతించి పార్వతిని విడిచిపుచ్చినాడు. వసు చరిత్రకారుడగు రామరాజ భూషణుడు సీతారాములను, సరస్వతీ బ్రహ్మలను, శివపార్వతులను స్తుతించియున్నాడు. ఈ క్రమమునందే ప్రత్యక్షముగ వ్యత్యస్తము కనుపించుచున్నది గదా !

మూర్తికవి ఆంధ్రకవులయందు విలక్షణుడుగా ఈక్రింది విషయముల వలన ఋజువగుచున్నది. "సంగీతసాహిత్యము" లనుద్వంద్వసమాసమునుమార్చి "సాహిత్యసంగీతము"లనుట యే గాక కవిస్తుతిలో కవుల నామములు పేర్కొనక—

"......అఖిల మునివ
చోనుపమశక్తిభృత పురాణార్థవితతు
లనుగు దెనుగను భవ్యదివ్యాంజనమున
గనుగొనగ జేయు నంధ్రసత్కవులదలచి" రా

ఇట్లాంధ్రకవుల నందఱ స్మరించుటయేగాక

"......నిఖిలోపకార ధీరాత్ములయిన
సకల కవిధూర్వహులకు నంజలియొనర్తు"

నని కవుల పోషించిన వారింగూడ స్తుతించి తనకు సాహిత్యమునగల ప్రేమాతిశయమును వెల్లడించినాడు. ఈ విధమున రామరాజభూషణుడుగాని, అన్యాంధ్రకవులుగాని వర్ణించియుండకపోవుట యీతనికి సాహితిపయి గల ప్రేమ విశిష్టతను వ్యక్తము జేయుచున్నది.

ఈ వ్యత్యాసము సంగీతప్రజ్ఞావిషయ సందర్భమున వీరిరువురు విద్యాధిదేవతలగు సరస్వతీబ్రహ్మల నుపవర్ణించిన సందర్భము నుదాహరించునపుడు వీరివిభేదములుగూడ విదితములగును. పయిసంగతి సందర్భములబట్టియు, ఈగ్రంథ ముల ప్రారంభ ప్రక్రమముల గల సామ్యభేదముల బట్టియు

రామరాజభూషణుని అనుకరణస్వభావము వ్యక్తమగుచుం డుటయేగాక వీరిభిన్నత్వముగూడ ప్రకటితమగుచున్నది.

**హనుమద్భక్తులు-**

"వీరుభయులు హనుమత్ప్రసాద లబ్ధకవితావైభవులే యగుటచే ఈఉభయకవులు అభిన్నులని" శ్రీ శాస్త్రిగారు వాదించుచున్నారు.

**సమాధానము:—**

వీరుభయులును హనుమత్ప్రసాద లబ్ధకవితా వైభవు లనుమాటవాస్తవమే; కాని వీరి యుపాసనాక్రమమున మహా దంతరముకలదు. ఆ అంతరమును తదుభయులగ్రంథముల నుం డియే నిరూపించి వారిభిన్నత్వమును నిర్ణయింతును.

మూర్తికవి గ్రంథారంభమున తన యిష్టదైవమగు నాంజనేయుని

"తన యాస్యగహ్వరంబునకు ఖద్యోతజృం
భణము ఖద్యోతజృంభణముగాగ
దనకరాంభోజాతమునగల గంధమా
దన మొకగంధమాదనముగాగ
దనశౌర్య హర్యక్షమునకు మైరావణ
స్ఫురణ మైరావణస్ఫురణగాగ
దనవాలదంభోళి కెనయుకర్బురగోత్ర
గరిమ కర్బురగోత్ర గరిమగాగ
వఱలు రామానుజన్మ జీవనప్రదాన

ధుర్య పర్యాయధాత మేదురవిరోధి
బలపయోధి విలంఘన ప్రబలశక్తి
యోబయనృసింహ భూభర్తకొసగుగాత॥ ౧ ఆ. ౭ ప.

యని పరమభక్తి విశ్వాసములతో ప్రస్తుతించుట కేవల మాంజనేయమంత్ర కల్పప్రోక్తమహిమానువర్ణనమేగాని వేరొకటిగాదు.

ఇక వసుచరిత్రకారుడన్ననో

"తరుణార్కకబళనోద్ధతి జూపె నెవ్వాడు
రుచులచే ఫలమోహరుచులచేత
అకలంకరామ ముద్రికజూపె నెవ్వాడు
శయముచే హృత్కుశేశయముచేత
మున్నీరు పల్వలంబుగదాటె నెవ్వాడు
జవముచే గుణగణార్ణవముచేత
అక్షశిక్షాప్రౌఢి నలరారె నెవ్వాడు
రణముచే నియమ ధారణముచేత
ధరణి నెవ్వాడు దానవద్విరద దళన
విహృతి దనకేసరి కిశోరవృత్తి దెలిపె
నతని మత్కావ్య భవ్యవాగమృతఘటన
మంజులస్వాంతు హనుమంతు మదిదలంతు॥ ౧ ఆ. ౮ ప.

"నను శ్రీరామ పదారవింద భజనానందుం జగత్ప్రాణనం
దను కారుణ్యకటాక్షలబ్ధకవితాధారాసుధారాశి" ౧ఆ. ౧౬ప.

యని వర్ణించియుండుట జూడ రామభక్తాగ్రగణ్యుడయిన ఆంజనేయుడు ఈ కవిశిరోమణికి కవితా ప్రసాదము

ననుగ్రహించినవాడనియు, శ్రీరామచంద్రమూర్తి ఇతనికి ఇష్టదైవమనియు దెలియుచున్నది. ఇంతియగాక హరిశ్చంద్ర నలోపాఖ్యానము నతడు శ్రీరామ చంద్రునకు నంకితము గూర్చుటయేగాక, కృతిభర్తృవంశాను వర్ణనము చేయునట్లు చేసియు తనివిదీరక తన పేరునుంగూడ రామభూషణుడని చెప్పి కొన్న రామభక్తాగ్రణి.

నరసభూపాలీయ కవికి ఇష్టదైవమగు నాంజనేయుడు అప్రతిమాన శౌర్యవంతుడు. రామునిబంటుగాక అతనితమ్ము డగు లక్ష్మణుని బ్రతికించిన అపరబ్రహ్మ. మూర్తి తన యిష్ట దైవమగు హనుమంతుని స్వకృతిభర్తను రక్షింపుమని కోరెను. రామరాజభూషణుడు ఆంజనేయుని తనకు మంజు వాగమృతము ప్రసాదింప ప్రార్థించెను. ఈభేదమును శాస్త్రి గారు రూపుమాపదలచి మూర్తియొక్క హనుమద్భక్తి క్రమ క్రమముగ రామభక్తిగ పరిణమించెనని పలుకుచున్నారు. నరసభూపాలీయ రచనాకాలమునాటికి మూర్తికి సుమారు 20 వత్సరములుండును. ఈవయస్సువచ్చువరకు మారనిభక్తి వృద్ధాప్యమున రామభక్తిగా మారెనను టఅసందర్భము, హేతుశూన్యము నగును. నేటికిని మన ఆంధ్రదేశమున ఆంజ నేయోపాసకు లనేకులుగలరు. ఆకోటికి జేరినవాడే యీ మూర్తికవియు. కావున వీరిని అభిన్నులనుట పొసగనేరదు. మూర్తి ఇష్టదైవము హనుమంతుడు. రామరాజభూషణుని ఇష్టదైవము శ్రీరాముడు. ఇతడు కేవలము హనుమంతుని మంజువాగమృతమును మాత్రమే యాచించెను. వీరిరువురకును

హానుమదుపాసనమున మహదంతరము గలదు. గావున శ్రీ శాస్త్రిగారి అభిన్నవాదము భిన్నముకాక తప్పదు.

సంగీతశాస్త్ర ప్రవేశము:—

"కవికృత గ్రంథత్రయము నందును కవియొక్క సంగీత కళారహస్యనిధిత్వము వెల్లడించు సంగీతశాస్త్రవిషయిక వర్ణనములుండుటచే వీరభిన్ను" లని శాస్త్రిగారి వాదము.

సమాధానము:—

నరసభూపాలీయకర్త సాహిత్యములో తనకనేకప్రజ్ఞలు కలవని చెప్పికొని ప్రత్యేకవిద్యయగు సంగీతము తనకు తెలిసినట్లే చెప్పికొనియుండలేదు. అట్లుచెప్పకొనియుండకపోయినను ఇందు అతనికి అధికమగు జ్ఞానముకలదని శాస్త్రిగారివాదము. "ఇక సంగీతకళారహస్యనిధియను బిరుదము నరసభూపాలీయ కవికి లేకుండుట భేదవాదమునకొక యాధారముగా శ్రీరామమూర్తిపంతులుగారు విపులముగా వ్రాసియున్నారు. నరసభూపాలీయమునందుగల (౧ఆ. ౪ప, ౩ఆ. ౧-౨౯ — ౧౩౫, ౫ఆ, ౧౮ప) సంగీతప్రసంగయుతపద్యములు నరసభూపాలీయ కర్తకుగల సంగీతాభిరుచిని వెల్లడి చేయజాలియుండును. మఱియు వానిలో "నొకటి యక్షరవిలాసోల్లాసము" నను సంగీత శాస్త్ర సంప్రదాయపూర్ణమగు పద్యము తద్గ్రంథకర్తకు గల సంగీతశాస్త్రప్రవేశము జూపగలదు" (వసు. వి. ౭౫) అని శాస్త్రిగారు వ్రాసియుండిరి.

శాస్త్రిగారిచే జూపబడిన నరసభూపాలీయమునందలి మొదటిపద్యముగాక తక్కిన పద్యములన్నియు ప్రసంగయుత పద్యములుగాన అందు కవిహృదయము వెల్లడికాదు. అయినను అందుకూడ సంగీతశాస్త్రాభినివేశము లేక సంగీతప్రసంగ మువమాత్రము కలదు. ఇక వానినట్లుండనిండు. శాస్త్రిగారుదహరించిన "ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించు" అను సరస్వతీస్తోత్రసంగతమగు పద్యమును ఉదాహరించుటయేగాక నరసభూపాలీయకవి బ్రహ్మను స్తుతించిన పద్యమును గూడ నుదాహరించి, మరియు వసుచరిత్రకారుడుకూడ వీరుభయులను ఎట్లువర్ణించెనో చూపించి, నరసభూపాలీయకవికి సాహిత్యము నందభిమానమేగాని సంగీతకళారహస్యనిధిత్వము లేదని ఋజువుపఱచి వీరిరువురి భిన్నత్వము నెఱుకపఱతును.

బ్రహ్మస్తుతి:—

"పలుకుల కొమ్మ నెమ్మొగము పార్వణచంద్రునిగా దలంచియు
జ్జ్వల నిజభద్రపీఠ జలజంబు నిమీలితమౌనొయంచు నే
ర్పలవడ భారతీవనిత నాత్మముఖంబులలోనె తాల్చుచున్
జెలగువిధాత యోబయ నృసింహునకిచ్చుచిరాయురున్నతుల్"
నరసభూపాలీయము. ౧ ఆ ౩. ప.

"సకలామోద కతాళవృత్తగతులన్ సంగీతసాహిత్యనా
మకవిద్యాయుగళంబు పల్కు చెలికింబాలిండ్లు జో డైసిరుల్
ప్రకటింపన్నఖరేఖలందు నలఘుప్రస్తారముల్ సేయు స
ర్వకళాకాంతుడు ప్రోచు దిర్మల మహారాయక్షమా వల్లభున్"
వసుచరిత్ర. ౧ ఆ ప ౩. ప.

నరసభూపాలీయాకవి బ్రహ్మను స్తుతియించుటలో సర స్వతిని ఆత్మముఖములలోనే బ్రహ్మధరించెననిస్తుతియించుటచే ఇతనికిగల సాహిత్యాభినివేశమే వెల్లడి యగుచున్నది. ఈ అంశము ఈకవియొక్కసరస్వతీ స్తోత్రమున స్పష్టీకరింపబడును.

వసుచరిత్రకారుడో "సంగీతమపి సాహిత్యం సర స్వత్యాః కుచద్వయమ్" "ఏకమూపాత మధుర మన్యదాలో చనామృత" మ్మను ప్రమాణము ననుసరించుటయే గాక తన సంగీత కళారహస్య నిధిత్వము వెల్లడి యగునటుల సంగీత సాహిత్యములను సరస్వతీ కుచద్వయమునుగా నుపవర్ణించి, బ్రహ్మ ఆ స్తనద్వయమును అలఘు ప్రస్తారములుసేయు సర్వ కళాప్రావీణ్యునిగా వెల్లడించుట చేతనే వీరి భిన్నత్వము ద్యో తకమగుచున్నది గదా !

సరస్వతీస్తోత్రము:—

"ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించ
నొకటి తాళప్రౌఢి నుల్లసిల్ల
నొక్కటి నారికేళోన్నతిదాల్ప నొ
కటి గోస్తనీగుచ్ఛకలన దనర
నొకటి సువృత్తభావోన్మేష మొంద నొ
కటి వల్లకీతుంబికలన జెలగ
నొకటి భారవిశేషయుక్తి బెంపొంద నొ
కటి గిరీశ మతానుకారిగాగ
నసమ సాహిత్య సంగీతరసముల నెడు
గుబ్బపాలిండ్లుదాల్చు పల్కులవెలంది

సరసగుణహారు నోబయనరసధీరు
నవ్యకృతినాయకునిగా నొనర్చుగాత !"
నరసభూపాలీయము. ౧ఆ. ౪౭.

"రమణీయాంశుసరాకృతింబొలుచు వర్ణశ్రేణి వీణానులా
పముచేతం గరగించి యందు నిజబింబంబొప్ప నచ్ఛామృత
త్వము నాత్మప్రతిపాదకత్వమును దద్వర్ణాళియందెల్ల బూ
ర్ణముగావించినవాణి తిర్మలమహారాయోక్తిం బొల్చుంగృపన్"
(వసుచరిత్ర. ౧ ఆ. ౪౭.)

నరసభూపాలీయకవి సరస్వతీస్తోత్రమున "సంగీతసాహిత్యము" లను ద్వంద్వసమాసమును "సాహిత్యసంగీతము"లని ప్రయోగించి తనకుగల సాహిత్యాభిమానమును ప్రదర్శించినాడు. ఇతడుదక్క ఈవిధముగ నీ సమాసమును మార్చినవాడు మరొక్కడు కానరాడు. ప్రతికవియును "సంగీతసాహిత్యము" లనియే ప్రయోగించెననుటకు ప్రమాణములెన్నియో గలవు.

"సంగీతసాహిత్యవిశారద" (అభిమన్యు పరిణయము)
"సరస సంగీతసాహితీభోజుండు" (కృష్ణరాయవిజయము)
"సంగీతసాహిత్య సరససౌష్ఠవయుక్తి (అనిరుద్ధచరిత్ర)
"సంగీత సాహిత్య చాతుర్య కవిత" (పల్నాటి వీరచరితము)

ఇట్లనేక ప్రయోగములు పూర్వకవికృత కావ్యములందు కలిగియుండుటయే గాక ప్రతి కవియు సరస్వతీ స్తనద్వయమును వర్ణించు పట్టుల ప్రథమ స్తనమును సంగీత పదముగనే వర్ణించి యుండెను.

" ఏనాటి కొకగుబ్బ గానశాస్త్రంబు రెం
డవ గుబ్బ సాహితీడంబరంబు"
(శ్రవణానందము)

"సంగీతసాహితీ స్తన్యం బొసంగి" (సౌందర్య మంజరి)

ఈ ప్రమాణములనన్నిట గానవచ్చుసాంప్రదాయమునకు విరుద్ధముగా నీ ద్వంద్వ సమాసమును ఛందోప్రతిబంధకము లెట్టివియు లేక పోయినను ప్రత్యేకాభినివేశమున మార్చి సాహిత్యమునకు ప్రాధాన్యమొసగి తనకుగల సాహితీరక్తిని ప్రకటించినాడు.

ఇక రామరాజ భూషణుడన్న తన సరస్వతీస్తోత్రమున సరస్వతీదేవి రమణీయమయిన అక్షసరాకృతిని ప్రకాశించుచున్న వర్ణమాలను వీణానులాపముచే గరగించి, ఆసరమందు తనఛాయను ప్రతిబింబింప జేసి ఆనందించుచున్నట్లు స్తుతించెను. ఇందు పూర్తిగా నితనికి సంగీతాభిమానము, సంగీతకళారహస్యనిధిత్వము స్పష్టముగా బుజువగుచున్నది.

ఇందువలన నరసభూపాలీయ కవికి సాహిత్యాభిమానము కలదనియు, వసుచరిత్రకారునకు సంగీతకళారహస్య నిధిత్వము కలదనియు నెల్లడియగుచున్నది. పయి పద్యములందు ఈ కవులకు గల అభిమానాదరములు భిన్న భిన్నములనియు, గ్రంథారంభ సందర్భములును వేర్వేరనియు నిర్ణయమగుచున్నది.

నరసభూపాలీయమును విరచించినమూర్తి కవికి సంగీతకళారహస్య నిధిత్వమున్నట్లు ఆతని కృతియందెచ్చోటను

గానరాకున్నయది. వసుచరిత్రకర్తయగు రామరాజభూష
ణుడు తనకా ప్రజ్ఞాపాటవములున్నట్లు చెప్పుకొనుటయేగాక,
వాని కృతులందుగూడ ఆవిషయము విశదమగుచున్నది.

"ఒకటి యక్షరవిలాసోల్లాసమున మించు" అను నరస
భూపాలీయపద్యమును "సకలామోదక తాళవృత్తగతులన్"
అను వసుచరిత్రకారుని పద్యము చమత్కరించుచున్న" దని
శాస్త్రిగారు వసుచరిత్ర విమర్శనమున (౧౭౪-౧౭౬ పుట) తమ
శక్తియుక్తులన్నియు నుపయోగించి వ్రాసియున్నారు. పయి
రెండుపద్యములును వాస్తవముగాభిన్నభిన్నమార్గములు గలిగి
యున్నవి. వానినెట్లయినను సమర్థింపనెంచి శాస్త్రిగారు
విఫలురైరి. వీరింతగా శ్రమపడుటకు గారణము శ్రీ గురజాడ
రామమూర్తి పంతులుగారు ఈపద్యములమూలముననే కవుల
భిన్నత్వమును సాధింపనెంచి ఉదాహరించి యుండుటయే. ఆ
వాదమును నిర్మూలము గావింపనెంచి వీరు వ్యర్థప్రయత్ను
లయిరని యనవలసివచ్చుటకు విచారించుచున్నాను.

ప్రజ్ఞలు.—

"ఉభయులుచెప్పిన ప్రజ్ఞలయందును వైధర్మ్యమగపడ
కుండుటచే వీరిద్దరు నొక్కరే" యని శాస్త్రిగారివాదము.

సమాధానము:—

ఉభయుల ప్రజ్ఞలయందును చాలభేదముగలదు. వారి
ప్రజ్ఞలనిట నుదాహరించి అందుగల భేదమును వివరింతును.

మూర్తికవి ప్రజ్ఞలు:—

శతలేఖినీపద్య సంధానధౌరేయు
ఘటికాశతగ్రంథకరణధుర్యు
నాశుప్రబంధ బంధాభిజ్ఞు నోష్ఠ్య ని
రోష్ఠ్యజ్ఞు నచలజిహ్వోక్తి నిపుణు
దత్సమభాషాసితాన్యజ్ఞు బహుపద్య
సాధిత వ్యస్తాక్షరీధురీణు
నేకసంధోచిత శ్లోకభాషాకృత్య
చతురు నోష్ఠ్యనిరోష్ఠ్య సంకరజ్ఞు
నమితయమకాశు.................."

(నరసభూపాలీయము. ౧ఆ. ౧౩ప.)

"గద్యము:—ఇది శ్రీ హనుమత్ప్రసాదలబ్ధకవితా సార స్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధ పఠనరచనా ధురంధర సకలభాషావిశేషనిరుపమావధాన..." మొదలుగా గల వివిధప్రజ్ఞలు తనకువశీకృతములయియున్నట్లు ముక్తకంఠ ముగ చెప్పుకొనియుండి, ప్రత్యేకశాస్త్రమగు సంగీతమున తనకు గల పరిచయమును - ప్రవేశము నేమాత్రముగనైననుసూచింపక పోవుట యిందు గమనింపదగిన అంశము.

వసుచరిత్రకారుని ప్రజ్ఞలు:—

"నను శ్రీరామ..............సం
జనితైకైక దినప్రబంధఘటికా సద్యశ్శత గ్రంథక
ల్పను సంగీతకళారహస్యనిధి ..........."

వసు. ౧ ఆ. ౧౬ ప.

గద్యము:—ఇది "శ్రీరామచంద్ర చరణారవిందవందన పవననందన ప్రసాద సమాసాదిత సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకషచతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణ.........." అని తనకుగల చిత్రవిచిత్రములగు ప్రజ్ఞాపాటవములన్నియు ప్రస్ఫుటముగావించినాడు. మూర్తి తత్సమభాషాకవి, అలంకార శాస్త్రనిష్ణాతుడు, ఘటికాశత గ్రంథకరణధుర్యుడు నయినవాడు. రామరాజభూషణుడు సంగీతకళారహస్యనిధి, ఉభయభాషాకవి, రసపోషణుడు నయినవాడు. కాబట్టి వీరి ప్రజ్ఞలయందు వైధర్మ్యము స్పష్టముగ ప్రత్యక్షమగుచుండ శాస్త్రిగారు లేదని వాదించుట నేమనవలయునో అగ్రాహ్యముగనున్నది. ఇందలి సత్యనిర్ణయమునకు కోవిదులగు పాఠకులే ప్రమాణము.

**పండిత వ్యవహారము:—**

"వీరిద్దరు నొక్కరేయను పండితవ్యవహారము అనుశ్రుతముగ ప్రసిద్ధమై యున్న"దని శాస్త్రిగారివాదము.

సమాధానము:—

వీరిరువు రొక్కరేయను పండిత వ్యవహారమున్నమాట వాస్తవమే. ఈ విధముగనే కృష్ణరాయ విరచితమగు ఆముక్తమాల్యద పెద్దనవిరచితమను పండితవ్యవహారముగూడ లోకమునగలదు. ఇటులనే మరికొన్ని అసత్యములయిన పండిత వ్యవహారములు లోకమున వ్యాపించియున్నవి.

పండితులందరును భట్టుమూర్తి యనునది బిరుదనామముగ గ్రహించినట్లు పురాణానామ చంద్రిక వలనను, దక్షిణ

హిందూస్థానకవుల చరిత్రమువలనను నిర్ణయమగుచున్నది. వివేచించినచో భట్టుమూర్తియనునది నామమేగాని బిరుదము గాదని ఆధునికు లందఱకును విదితపూర్వమగు విషయమే. కావున భ్రమమూలకమగు నీ ప్రాచీనపండిత వ్యవహారమును నాధారముగా గొని ఐక్యతావాదమును సమర్థింప బూనుట అనుచితమును, పరిహాస పాత్రము గూడ నగును.

లక్షణ గ్రంథములు:—

"కొన్ని లాక్షణిక గ్రంథములయందు వసుచరిత్రములోని పద్యముల నుదాహరించునప్పుడవి భట్టుమూర్తివిరచితములని వ్రాయబడియుండె"నని శాస్త్రిగారు వ్రాయుచున్నారు.

సమాధానము:—

లక్షణశాస్త్రజ్ఞులు తమకు గావలసినప్రమాణముల కొఱకేపరిశ్రమింతురుగాని అవి యేకృతివిశ్కృతములో, యేగ్రంథస్థములో పరిశోధింప నంతగా ప్రయత్నింపరు.

"ఒకనాడిందుధరుండు పార్వతియు" నను పద్యము తెనాలి రామలింగని ఇందుధరోపాఖ్యానము నందలిదని రంగరాట్ఛందస్సునందుగలదు. అప్పకవి ఈపద్యమునే ఆదిపురాణము (ఆదిత్య పురాణము)లోనిదని వ్రాసెను. వాస్తవముగ ఈ పద్యము నాచనసోముని ఉత్తర హరివంశమునందలి ఇందుధరోపాఖ్యాన ఘట్టమునగలదు.

కృష్ణరాయకృతమని విష్ణుచిత్తీయమునందే యుండగా అహోబలపతి, అప్పకవి మొదలగు లక్షణజ్ఞులు ఏమి పరిశోధించి దానిని పెద్దనకవికృతమని వ్రాసియుండిరి.

చిత్రకవి పెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుడు, గణపవరపు వెంకటకవి, పెదపాటి జగన్నాథకవి మొదలగు లక్షణశాస్త్రజ్ఞులు పద్యముల కొన్నిటి నుదాహరించి ఆ పద్యములు వల్లభరాయ కృతములని యనియుండిరి. అప్పకవి, లింగముగుంట తిమ్మకవి మొదలగు లాక్షణికులు ఆ పద్యములనే శ్రీనాథునివని యనిరి. ఈ పయి విషయములబట్టి లాక్షణికులు తబ్బిబ్బులుగా ప్రమాణముల నిచ్చుచుందురని స్పష్టపడుచున్నను, వీరి వచనముల నాధారముగాగొని సత్యనిర్ణయము గావించుట ఎట్లు పొసగును ?

**టీకాకారుడును భట్టుమూర్తియే యనుట:—**

"వసుచరిత్రటీకాకారుడగు సోమనాథకవి తన వ్యాఖ్యానావతారికలో వసుచరిత్రము భట్టుమూర్తిచే వ్రాయబడినదని వ్రాసియున్నట్లు" శాస్త్రిగారు వ్రాయుచున్నారు.

శ్రీ శాస్త్రిగారు భట్టుమూర్తియే వసుచరిత్రవిరచించినట్లు సోమనాథునిచే వ్రాయబడినవని రెండు పద్యములగూడ నుదాహరించిరి.

"ఈరీతిం గవితావితానవృతగౌరీశానమౌళీస్థలో
దారోద్దేశుడనైన నాకు వెస విద్యావంతులెల్లన్ మనో
హారి ప్రక్రియ మూర్తిచేత రచితంబై విశ్రుతంబౌ వసు
క్ష్మారాట్చిత్రచరిత్ర టీకకయి యుత్సాహంబు పుట్టించినన్"
"కారణజన్ముడై కవినికాయము మెచ్చగ గావ్యకర్తమై
భూరికళాకళాపుడయి పొల్పువహించిన భట్టుమూర్తిచే

నీరితమై సుఖార్థపద హీనపదాస్పదమైన యీ వసు
ఘ్మారమణప్రవృత్తము సుసాధ్యము కాదు తలంచి చూడగన్''

ఈ పయి పద్యములందెంతవరకును భట్టుమూర్తి ప్రశంసయే గలదు; గాని అతనికి బిరుదనామముగా గాని నిజనామముగా గాని లోకవ్యవహారమున ప్రసిద్ధము, నతని కవితాప్రకర్షకు పరిపోషకము, వసుచరిత్రముననే నిర్దిష్టమునైయున్న "రామరాజభూషణ" పదమును స్మరింపనందున నివి సోమనాథ రచితములుగాక కించుజ్ఞుడగు నేవానిచేతనో రచింపబడి ఆ వ్యాఖ్యాతపేర ప్రకటితములై యుండనోపునని ఊహామాత్రముగా గాక సోమనాథుని టీకాపంక్తులవలననే మునుముందు ధ్రువపరుప బడును.

ఈవిధముగనే ఆముక్తమాల్యదా వ్యాఖ్యాత యగు గుడిపాటి వెంకటకవి "అల్లసాని పెద్దన ఆముక్తమాల్యదా కృతి సమంచితముగ జేసె'' నని వ్రాసినట్లు ప్రతీతి గలదు. పైవిధముననే మరొక వ్యాఖ్యాతయగు శ్రీనివాస కవి గూడ "పెద్దనార్యుడుద్ధత ఫణితిన్ రచించె''నని పీఠికలో వ్రాసినట్లు చెప్పుదురు. పయి పద్యములు అవతారికాభాగములో లేవనియు, ఆముక్తమాల్యదాకవయిత కృష్ణరాయ లేయనియు విశేషపరిశ్రమ జేసి నిర్ధారణచేయుటయేగాక, టీకాకారులును అటులే వ్రాసియుండిరి యని సప్రమాణముగ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు వ్రాసియుండిరి. (భారతి ౧౪ సం. ౯ సంచిక).

ఇంతియగాక సాహితీసమరాంగణ సార్వభౌముడని ప్రఖ్యాతిగాంచిన కృష్ణదేవరాయలకు కుమార్తెయు, ఆంధ

కవితా పితామహుడని ప్రసిద్ధికెక్కిన పెద్దన శిష్యురాలు నగు మోహనాంగియను నామాంతరముగల తిరుమలాంబ (అళియ రామరాయలసతీమణి)చే రచింపబడిన మారీచీ పరిణయమను మధురతర కావ్యము నందలి

"అకలుష మాధురీకలితమై యలసానికవీశుబోలె న
ల్లికబిగి ముక్కతిమ్మ కవిలీలను ముద్దుగుబల్కు పాండురం
గకవిగతిఁ బదక్రమముగల్గు కవిత్వముతోడ విష్ణుచి
త్తుకథ రచించు మజ్జనకు దొరపుబత్తి నుతించి మ్రొక్కెదన్"

అను పద్యమువలన రాయలు ఆముక్తమాల్యదా కర్తయని నిర్ణయమగుచున్నది.

ఇట్లు ప్రబల ప్రమాణములు గలిగియున్న రాయల కర్తృత్వమును త్రోసివైచి, అసంగతపద్యములనల్లి అలసాని పెద్దనను ఆముక్తమాల్యదాకారునిగా చేసియున్నట్లుగనే వసుచరిత్ర భట్టుమూర్తి రచితమని అనాలోచిత పద్యముల నల్లిరి.

విష్ణుచిత్తీయకర్త రాయలని పయిసందర్భమున ఋజువయ్యెనేగాని వసుచరిత్ర కర్త మూర్తి కాడని యెట్లు నిర్ధారితమైనదని పాఠకులు ప్రశ్నింపబోదురుకాబోలు!

వ్యాఖ్యాతయగు సోమనాథకవి " శ్రీరామక్షితిపున్ ......రామభూషణకవీ! ధన్యుండ వీవన్నిటన్" (౧. ఆ. ౧౩. ప.) అను పద్యమునకర్థము వ్రాయుచు "రామభూషణ కవీ" యను పదమునకు "రామభూషణ నామధేయముగల కవీ!" అని వ్రాసెను కాని "రామరాజభూషణ అను బిరుదముగల కవీ!" అని వ్రాసియుండకపోవుటచే యిదిభట్టుమూర్తి విరచితము కాదనియు, వ్యాఖ్యాతచే కథితములని పూర్వోదా

హ్యాతములయియున్న రెండు పద్యములును ఆముక్తమాల్యదా కర్తృత్వనిర్ణాయిక పద్యములవలెనే కల్పితములనియుసుస్పష్ట మగుచున్నది.

కవితారీతి.

"గ్రంథత్రయమునందలి కవితారీతి ఏకరీతిగ నుండె" నని శాస్త్రిగారి వాదము.

సమాధానము:—

నరసభూపాలీయము మృదుమధురము, మధుబిందు ప్రస్యందములగు తేటతెలుగుపలుకులకూర్పుతో ద్రాక్షాపాకమున విరచింపబడియున్నది. వసుచరిత్రము సంస్కృతసమాస పదభూయిష్ఠము, శ్లేషయమకాలంకారాది సమ్మిశ్రితమునై నారికేళపాకమున బడియున్నది. ద్వ్యర్థికావ్యమగు హరిశ్చంద్ర నలోపాఖ్యానమును దాని బోలియే కఠినాతికఠినముగ గూర్చ బడియున్నది. ఇదియేగాక నరసభూపాలీయకవి "శ-స" లకు 'రేఫ-శకటరేఫ' ములకు ప్రాసము గూర్చినాడు. దీనిలోగల బంధగర్భకవిత్వము తక్కిన రెండుగ్రంథములందును గాన వచ్చుటలేదు. కావున గ్రంథత్రయమునందలి కవితారీతి ఏక విధముగ నుండెననుట అసంబద్ధమగుచున్నది.

వసుచరిత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానములకు కర్త ఒక్కడే అని శాస్త్రిగారు వాదింతురు.

సమాధానము:—

ఈవిషయమున వివాదమేలేదు. కాదనియున్నవారుం గూడ లేరుగదా ! హరిశ్చంద్రనలోపాఖ్యానమున వసుచరి

త్రమును తాను రచించియున్నట్లు చెప్పికొనియే యుండుటచే తను, ఉభయగ్రంథముల గద్యములు సమానములుగ నుండు టచేతను ఈ రెంటికి గర్త ఒక్కడే అని అందరును నిర్వివాద ముగ నంగీకరించుచునేయున్నారు.

పయి పేర్కొనబడిన కారణములనేగాక శాస్త్రిగారు తమ అభిన్నవాదమునకు వసుచరిత్రవిమర్శనమున మఱి కొన్నిటినిగూడ ఆధారములుగ చూపించియుండిరి. క్రమక్రమ ముగ వానికిగూడ నుచితరీతి సమాధానములు వ్రాయుదును.

రామవిభుదత్తమేది ?

'రామవిభుదత్త శుభచిహ్న విభవయుతుడ' నను దానిచే నీకవికి రామరాజు "రామరాజభూషణు"డనుబిరుదము నిచ్చెనని శాస్త్రిగారి వాదము.

సమాధానము:—

రామరాజభూషణుడు తనహరిశ్చంద్రనలోపాఖ్యానమున
"వనధిలంఘనకృపావర్ధితో భయకవి
తాకళారత్న రత్నాకరుండ
సకలకర్ణాట రక్షాధురంధర రామ
విభుదత్త శుభచిహ్న విభవయుతుడ
వసుచరిత్రాది కావ్యప్రీత బహునృప
ప్రాపితానేక రత్నప్లవుండ
శాశ్వత శ్రీవేంకటేశ్వరానుగ్రహ
నిరుపాధికైశ్వర్య నిత్యయశుడ

శ్రీకర మహాప్రబంధాంక సింగరాజ
తిమ్మరాజ ప్రియతనూజ ధీరసూర
పాత్మజుడ రామభూషాఖ్యబరగు సుకవి
నంకితమొనర్తు నీకావ్య మనఘు భక్తి”

నని తన్ను గురించి చెప్పుకొనియుండెను.

ఇందలి ‘శుభచిహ్న విభవయుతుడ’ ననుదానికి విమర్శకులు పలువురు వ్రాసినదానినుదహరించి, పిమ్మట నా సమాధానమును వివరింతును.

“హరిశ్చంద్రనలోపాఖ్యానమున “రామ విభుదత్త శుభచిహ్న విభవయుతుడ” నని చెప్పుకొనుటచే రామరాజ భూషణునకు ‘శుభ’ యను బిరుదము గలదని వీరేశలింగం గారు వ్రాసియున్నారు” (వసు. వి. ౯౦) “రామవిభుదత్త శుభచిహ్న విభవయుతుడ” ననుదానిచే రామరాజీకవికి “రామరాజభూషణు”డను బిరుదము నిచ్చెనని గ్రహించుట యుచితము” అని శాస్త్రిగారు వ్రాసిరి. (వసు. వి. ౯౧).

పూండ్ల రామకృష్ణయ్యగారు “రామవిభుదత్త శుభచిహ్న విభవయుతుడ” ననుచో రామరాజుచే నీయబడిన మంగళకరములైన యాందోళికాది చిహ్నములు గల వాడని యర్థము చెప్పిరి” (వసు. వి. ౯-౬)

“రామవిభుదత్తశుభచిహ్న విభవయుతుడ” ననుదానికి రామరాజుచే నీయబడిన మంగళకరములగు చిహ్నములు గల విభవముగలవాడని శబ్దార్థము. కనుక రామరాజు రామరాజభూషణునకు నిట్టివేమైనయిచ్చెనేమో తెలిసికొనుటకు

ఆధారములేమైనకలవాయని విచారించుట మనకు ప్రస్తుతవిషయము. దీనికివలసినన్ని యాధారములుకలవు. రామరాజభూషణుడు వసుచరిత్రమున తనకును రామరాజునకును గల సంబంధము రామరాజునకు తమ్ముడును, వసుచరిత్ర కృతిభర్తయు నగు తిరుమలరాయునిచే నిట్లు చెప్పించియుండెను.

"శ్రీరామక్షితిపుఙ్ మదగ్రజు జయశ్రీలోలు నానాకళా
పారీణుఙ్ బహుసంస్కృతాంధ్రకృతులం బల్మారుమెప్పించి త
త్కారుణ్యంబున రత్నహారహయ వేదండ గ్రహారాది స
త్కారంబందితి రామభూషణకవీ! ధన్యుండవీవన్నటన్."

(వసు. ౧. ఆ. ౧౭. ప.)

ఇందితడు రామరాజుచే రత్నహారహయవేదండాగ్రహారాది సత్కారం బందినట్లు చెప్పబడినదికాని "రామరాజభూషణ" అను బిరుదమును పొందినట్లు చెప్పబడలేదు. ఇంత వివరముగా స్వవిషయము చెప్పికొనియున్నవాడు బిరుదము సంగతి విస్మరించెననుటగాని, అవకాశము లేదనుటగాని యుచితముగాదు. దీనినే సంగ్రహముగ హరిశ్చంద్ర నలోపాఖ్యానమున "రామవిభుదత్తశుభచిహ్నవిభవయుతుడ" నని చెప్పికొనియుండెను. రత్నహారహయవేదాండాదులు శుభచిహ్నములగుననియు, రామరాజభూషణుడనునది కాదనియు వ్రాయవలసిన యగత్యముకాని అవసరముకాని లేదు.

"దేవరాయ మహారాయ ధీవిధేయ
మంత్రివల్లభ చామనామాత్యదత్త

చామరచ్ఛత్ర భూషాది సకల భాగ్య
చిహ్నముల నొప్పి జన్నయసిద్ధమంత్రి"
( విక్రమార్క చరితము)

జక్కయకవి జన్నయసిద్ధమంత్రి చామరఛత్రాది సకలభాగ్యచిహ్నములనందియున్నట్లు చెప్పెను.

"అరుదారన్ వివిధాగ్రహారములతో నాందోళికా ఛత్రచామర కళ్యాణకళాచికాది బహుసన్మానార్హ చిహ్నంబు లాదర మొప్పారగ వేమభూవరునిచేతన్ గాంచె సామ్రాజ్య సంభరణప్రౌఢుడమాత్యసింగడు నయప్రాగల్భ్య గర్వోన్నతిన్"
(శృంగారనైషధము. ౧. అ. ౩౮.)

'శక్రాపాదిత దివ్యచిహ్నధరుడై' (వసుచరిత్ర. ౧ఆ. ౯౩ప.)

ఈపయి పద్యోదాహరణములబట్టి "చిహ్న" యనునది ఛత్రచామరాందోళికాదులకు నుపలక్షణమేకాని బిరుదమునకుగాదని రూఢమగుచున్నది.

ఈ పయి సమర్థనములచేతనేగాక "రామభూషాఖ్య బరగు సుకవి" నని యాపద్యమునందే చెప్పఁబడి యుండుటచేత "రామరాజభూషణు"డనునది స్పష్టముగ నామపరమని విదితమగుచుండ బిరుదమని సమర్థింపజూచుట నేమనవలయునో దెలియవచ్చుటలేదు.

భూషణసాంప్రదాయము:—

వసుచరిత్రకారుడు తన పేరు "రామరాజభూషణు" డనినిస్సందేహముగ పయిరీతిని వ్యక్తము సేసియుండ అది బిరుదమేయని బలపఱచుటకు శ్రీశాస్త్రిగారు మిక్కిలి పరిశ్రమిం

చి భూషణసంప్రదాయము నొకటిపరికల్పించిరి. ఆసంప్రదాయమునగల రహస్యమును బాహిరవెట్టి యాథార్థ్యము నెఱుకపఱచి వీరి భిన్నత్వమును బలపఱతును.

కృష్ణదేవరాయభూషణుడు:—

"భట్టుమూర్తికి "రామరాజభూషణ"యనునది రామరాజదత్తమగు బిరుదచిహ్నమయినట్లే యాతని తండ్రియగు సూరపరాజునకు "వేంకటరాయభూషణ" యనునది వేంకటరాయలచే నీయబడిన బిరుదమైయుండును. ఆకాలమున నిట్టి "భూషణ" బిరుదములుండుట ఆచారమయియున్నట్లు పైడిమఱ్ఱి వెంకటపతికి పూర్వుడగు చంద్రాంగద చరిత్రమునందు వర్ణింపబడిన(కవులచరిత్రము. ప్ర.ము.3భా.73.పు.) కృష్ణదేవరాయభూషణుడే వ్యక్తపరుపగలడు. (హ.న.పీ.9పు.)అనియు,

"..................కృష్ణ
రాయభూషణకుల రామరాజతనయ
కేశవాత్మజ పర్వతాధీశు వేంక
టాద్రికిదె కావ్యమేనిత్తు నంకితముగ"

అని యిట్లు చంద్రాంగదా చరిత్రకారుడగు పైడిమఱ్ఱి వేంకటపతికి పూర్వుడగు కృష్ణదేవరాయభూషణుడను నొక కవి యుండలేదా! ఇతని కేమి ప్రసిద్ధి గలదు? ఇతడు కృష్ణరాయల యాస్థానమునకలంకారభూతుడగుటచే నీతని కీ పేరు వచ్చెనని కవుల చరిత్రమున వ్రాయబడినదికాదా! (వసు. వి. ౯-౨.) అనియును శాస్త్రిగారు వ్రాసియుండిరి.

సమాధానము:—

శాస్త్రిగారు తమ అభిన్నవాదమునకు ప్రమాణములుగా స్వీకరించియున్నవానివలననే నేను భిన్నత్వవాదమును సమర్థించుకొనుచున్నాను. ఈ పరిశోధనమునకయిన శ్రమ యంతయు శ్రీ. శాస్త్రులవారిదే ! ఇందులకు వారికెంతయు కృతజ్ఞుడను.

శాస్త్రిగారు "రామరాజభూషణుడు" "వేంకటరాయ భూషణుడను" నవి ఆయారాజుల నామసామ్యమునుబట్టి బిరుదములని నిశ్చయించినట్లే యైక్యవాదులగువీరేశలింగంగారును ఆంధ్రకవుల చరిత్రమున నిశ్చయించి యుండిరి. దీనికి వీరి యూహలుగాక వేరు ఆధారములేవియు గానరావు.

కృష్ణరాయల ప్రియపుత్రికయగు మోహనాంగి తన మారీచీపరిణయములో

"మనుచరిత్రము కృతిగనొసంగి పెద్దన
దగు నాంధ్రకవితా పితామహుండు
నర్థిమై బారిజాతాప హరణము కృ
తిగ నొసంగిన నంది తిమ్మనకవి
మాటల నతులిత మాధురీమహిమంబు
తోడ బలుకుచుండు ధూర్జటికవి
రసముప్పతిలుచుండు రచనచే సుధవెద
జల్లు మాదయగారి మల్లనకవి
మున్నుగల యష్టదిగ్గజంబులను కవుల
మంత్రిసత్తముడైన తిమ్మరుసుగూడి

భువనవిజయ నామక సభాభవనమందు
నోలగంబుండు కృష్ణభూపాలకుండు" ౧. ఆ. ౮౭ వ
పద్యమువలన రాయల సభలో అష్ట దిగ్గజములని ప్రఖ్యాతిగన్న కవులేగాని కృష్ణరాయభూషణుడను మరొక కవి లేడని స్పష్టపడు చుండుటచే కృష్ణరాయభూషణుడు రాయలసభాభూషణుడనుట కేవల కల్పితమగుచున్నది.

వేంకటరాయభూషణుడు:—

"రామరాయభూషణుని తండ్రియగు సూరపరాజునకు "వేంకటరాయభూషణు"డను బిరుదనామమున్నట్లు శాస్త్రిగారి వాదము.

సమాధానము:—

శాస్త్రిగారు వెంకటరాయల సభలో సూరప రాజుండుటచే "వెంకటరాయభూషణ"యని బిరుదము వచ్చియుండ నగునని యందురు. ఈ వెంకటరాయలు కృష్ణదేవరాయల తమ్ముడగు అచ్యుతదేవరాయల కుమారుడు. ఈఅచ్యుతదేవ రాయలు ౧౫౩౦-౪౧ వరకు రాజ్యమును పరిపాలించి యుండెను. ఇతని తరువాత వెంకటదేవరాయలు ఆరు మాసములు మాత్రము పరిపాలించి పరమపదించి యుండెను. అందువలన చరిత్రకారులు ఈతని పేరును పేర్కొనరయిరి. ఇట్టియెడ నీతని సభలో భూషణుడున్నాడనుట కృష్ణరాయ భూషణుడు రాయలవారి సభలోనుండెననుట వంటిదియే యగుచున్నది. కావున భూషణ సంప్రదాయము నాధారముగా గొని రామరాజభూషణుడనునది బిరుదమాత్రపరమే

యని నిర్ణయించుట సమంజసము, సకారణము కానందున అది అప్రాప్తమగుచున్నది.

భట్టుమూర్తియే రామరాజభూషణు డన్నచో రామరాజభూషణుడు "ధీరసూర పాత్మజుడ" నని మాత్రమే తన తండ్రినిగూర్చి చెప్పుకొని యుండెనేకాని తన బిరుదము చెప్పికొనినట్లుగనే తన తండ్రియొక్క బిరుదమునుగూడ చెప్పక యేల విడిచిపుచ్చును. ఇయ్యది సరసమా! సాంప్రదాయమా! కనుక భట్టుమూర్తి తండ్రిపేరు వేంకటరాయభూషణుడనియు, రామరాజభూషణుని తండ్రిపేరు సూరపరాజనియు సుస్పష్టమగుచుండ నీవిషయమై శాస్త్రిగారు "అపవాదితో బ్రహ్మ" యన్నట్లు ప్రవర్తించి, "శేషంకోపేన పూరయేత్" అనునట్లు ప్రవర్తించిరనుట ఈ దిగువ నుదాహృతమగుదానిని బట్టి వ్యక్తముకాగలదు.

"హరిశ్చంద్రనలోపాఖ్యానమునందలి సీసమున దండ్రిపేరు సూరపరాజని చెప్పుకొనుటకు అవకాశము చాలనందున సూరపుడని చెప్పినాడు. కావున అందు నామాంతరము చెప్పికొనకుంట శంకాస్పదము కానేరదు. రామరాజభూషణుడకాలమున మహాప్రసిద్ధుడై యుండుటచే తననామధేయమునకే యిట్టి సంశయావస్థ తటస్థించునని స్ఫురింపక పోవచ్చును. అట్లే స్ఫురించియున్నచో మరియొక్క పద్యమును చేర్చి స్పష్టముగ జెప్పును. మరి రిజిష్టరు (Register) చేయించునా?" (వసు. వి. 93.) అని శాస్త్రిగారు ఆగ్రహమునుపసంహరించుకొనలేక వ్రాసినారు.

రామరాజభూషణుడా కాలమున ప్రసిద్ధుడై యున్నచో నాతనిని భట్టుమూర్తియని యేలయనిరి? స్థలములేకపోయిన మాత్రమున మరియొక పద్యమును చెప్పక వదలిపెట్టునా? వారిపేరు అసలంతియేగనుక అట్లు వ్రాసికొనియుండిరి. దానిని కాదని శాస్త్రిగారు వాదముసేయుట నేలవిడిచి సాముసేయుటవలె నున్నది.

రామరాజభూషణుడు:—

"రామరాజభూషణున కాబిరుదమునిచ్చిన రామరాజు సదాశివరాయలకు రాజప్రతినిధిగా మాత్రమే యుండుట చేతను, విజయనగర రాజ్యాభిషిక్తుడు కాకుండుటచేతను అతనికి రామదేవరాయలన్న పేరు రాలేదు. ఇకనాతడు రాజన్న పేరులోనేయుండెను. కావుననే యీతని సభకలంకారభూతుడగు మూర్తికవికి "రామరాయభూషణ" యను బిరుదము రాలేదు. ఇకను "రామరాజభూషణ" యని మాత్రమే బిరుదము వచ్చెను" (వసు. వి. ౬౨) అని శాస్త్రిగారువ్రాసిరి.

సమాధానము:—

ఒకమారు శాస్త్రిగారి వచోనైపుణ్యమును గాంచుడు! విజయనగరరాజ్యపట్టాభిషిక్తుడయినప్రతివానికి "దేవరాయ" అను బిరుదమున్నట్లు శాస్త్రిగారే వ్రాసిరిగదా! అట్టియెడ "రామరాయభూషణ" గాక "రామదేవరాయభూషణ" యను బిరుదము రావలెను. వీరిట్లు వ్రాయుటకు కారణము వీరి భూషణసాంప్రదాయకులందరు "దేవ" యనుశబ్దము చేర్చబడి చెప్పబడియుండలేదు. వారు "కృష్ణరాయభూషణ, వెంక

టరాయభూషణ'' అని మాత్రమే చెప్పబడియుండిరి. పయి ప్రకారము వీరికి "కృష్ణదేవరాయభూషణ, వెంకటదేవరాయ భూషణ" యని లేకపోవుటచే యివి బిరుదనామములుగాక పేర్లేయని తేలుచున్నది.

**రామరాజు రాజప్రతినిధిగాక రాజే:—**

రామరాజు రాజప్రతినిధియైనట్లు రామాభ్యుదయము లోని పద్యమును (శ్రీ శాస్త్రి)గారుదాహరించి యుండిరి. అతడు రాజేయైయుండినట్లు ఈ క్రింది ఉదాహరణములు విదితము చేయుచున్నవి.

"ఆరామశౌరి పిమ్మట
ధీరామరశాఖి వీరతిరుమలరాయం
డారామసేతు హిమవ
త్సారమణీరమణుడై జగంబు భరించెన్"

(వసు. ౧ఆ. ౫౫.)

"అతడు కర్ణాటరాజ్యరమాధినాథు
డార్యరక్షావిచక్షణుండద్రిధైర్యు
డనఘచారిత్రుడఖిలరాజాధిరాజ
రాజపరమేశ్వరుడు రామరాజవిభుడు"(రామరాజీయము)

"అవని యంతయు రామరాజ్యంబుసేసె
దన గుణంబులు కవికల్పితములు గాగ
నలవియె రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొకరాజమాత్రుడె రామ విభుడు"

(నరసభూపాలీయము. ౧ ఆ. ౬౨ ప.)

"చివరలో సదాశివరాయని నిర్బంధితునిగ నొనర్చి రామరాజే రాజైనట్లు శాసనములు నుడువుచున్నవి"

(విజయనగరవీరులు. ౭౬)

"౧౫౬౫ సం॥ నాటి గండికోట బంగారు నాణెమున నొకవైపున ప్రభావళిలో విష్ణువిగ్రహమును, మరియొకవైపున "రామరాయ" యను పేరును ఇప్పటికి నక్కడక్కడ చూడ నగును. ఇంతియగాక సార్వభౌమబిరుదము లన్నియు రామరాజు గయికొన్నట్లు కృష్ణరాజపేటలోని శాసన మొకటివెల యించుచున్నది. "రాజాధిరాజరాజపరమేశ్వర వీరప్రతాప మహారాయ రామదేవలయ్యంగారు" అను బిరుదావళి ఈశాసనమందు చెక్కబడి యుండుటచే రామరాజు రాజప్రతినిధి కాడని తెలియుచున్నది. (అళియరామభూపాలుడు. ౧౧౫)

'రాయ' యను శబ్దము రామరాజునకు లేదా?

"రాయ" అను శబ్దము రామరాజునకు లేదని శాస్త్రి గారు నుడివిరి. ఉన్నట్లు ప్రబల తార్కాణము లెన్నియో గాన్పించుచున్నవి. ఈక్రింది యుదాహరణములనవధరింపుడు!

"Rama Raya made an expidition"

(For gotten Empire I93).

రామరాయలొక దండయాత్ర చేసెను. అని యర్థము.

"శ్రీ రామరాయే శ్రితభాగధేయే
శౌరేః పదం శాశ్వతమభ్యుపేతే"

ఎపిగ్రాఫిక ఇండికా. ౧౯ పుస్త. ౩౩౮ పు.)

"శ్రీరామక్షితిపున్" (వసు. ౧అ. ౧౭౬ప.) అనుదానికి టీకాకారుడు "సంపద్యుక్తుడైన రామదేవరాయలు" అని అర్థము వ్రాసెను. ఇతనికి 'రాయ' బిరుదము లేదన్న శాస్త్రిగారే తమ వసుచరిత్ర విమర్శనమునందు ఇతనికి 'రాయ' బిరుదమునుపలుమారులు ప్రయోగించియుండిరి. వానిలో మచ్చునకు కొన్నిటి గాంచుడు.

'అళియరామరాయలు' (వసు. వి. ౧౩౫పు.)
'తిరుమల దేవరామరాయాదులు' (౧౩౬)
'రామరాయల యనంతరమున' (౧౪౭)

ఈప్రమాణములబట్టి రామరాజునకు రాయలను వ్యవహారము గూడ రూఢమైయున్నట్లు, రాజ్యపరిపాలనము చేసియున్నట్లును, స్పష్టమగుచున్నది. కావున శాస్త్రిగారు వాదించియున్నటుల ఆతని సభకు అలంకారభూతుడుగా నుండియుండెనని చెప్పబడిన భట్టుమూర్తికి 'రామదేవరాయభూషణ' అను బిరుదముండవలెనుగదా! దీనిబట్టియే "రామరాజభూషణ" అనునది బిరుదముగాక నామమేయని నిర్ణీతమై, భూషణసాంప్రదాయవాదమెల్లయు నిరాధారమయినందున నిరాస్తమగుచున్నది.

### కవుల సంగ్రహ స్వీయచరిత్రములు:—

ఐక్యతావాదమునకు శాస్త్రిగారు అనేకకారణములు చూపించియుండిరి. వాని నన్నిటిని సోపపత్తికముగ - సత్యా

సంగతముగ నిరాధారము లని విశదపఱచియుంటిని. మా వాదప్రతివాదముల నించుక నటుండనిండు. ఈ కవులు తమ్ము గురించి ప్రస్తావించుకొనియున్న స్వీయచరిత్రలబట్టియే వారి భిన్నత్వము ప్రతిపాదితమగుచున్నది. కావున నీ క్రింద వాని నుదాహరించుచున్నాను.

మూర్తి స్వీయచరిత్ర:—

"..................ప్రబంధాంకసింగ
రాజసుత తిమ్మరాజపుత్ర ప్రసిద్ధ
సరస వేంకటరాయభూషణ సుపుత్రు
నను బుధవిధేయు శుభమూర్తి నామధేయు"

(వ. భూ. ౧. అ. ౧౭ప.)

"గద్యము:- ఇది శ్రీహనుమత్ప్రసాదలబ్ధ కవితా సారస్వతాలంకార నిరంకుశ ప్రతిభాబంధుర ప్రబంధపఠన రచనా ధురంధర ప్రబంధాంక వేంకటరాయభూషణ సుపుత్ర...... తిమ్మరాజపౌత్ర సకలభాషావిశేష నిరుపమావధాన శారదామూర్తి మూర్తి ప్రణీతంబైన కావ్యాలంకార సంగ్రహము"

ఇందుమూర్తి తన తండ్రిపేరు వేంకటరాయభూషణు డని చెప్పకొనెను. అది తన తండ్రిబిరుదనామమని చెప్పి యుండలేదు. అది అతని బిరుదనామమని శాస్త్రిగారు వాదింతురు. బిరుదనామమునకు పుత్ర శబ్దముకలిపి కుమారులు జనకుల పేరునుపేర్కొనుసాంప్రదాయము ఆంధ్రసారస్వత ప్రపంచమున

నెచ్చటను గానవచ్చుటలేదు. నూటికి తండ్రిపేరునకు తుదనే పుత్ర శబ్దమును చేర్చి వాడుట సర్వసామాన్యము - సమంజసము నయినసంగతి. కావున ఈ వేంకటరాయ భూషణ శబ్దము నామధేయమేగాని బిరుదవాచక మేమాత్రము గానేరదు.

రామభూషణుని స్వీయచరిత్ర:—

"శ్రీకర మహాప్రబంధాంక సింగరాజ
తిమ్మరాజ ప్రియతనూజ ధీరసూర
పాత్మజుడ రామభూషాఖ్యబరగు సుకవి"

"గద్యము:- ఇది శ్రీరామచంద్ర చరణారవింద వందన పవన నందన ప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్రభాషా సామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్య రసపోషణ రామరాజభూషణ" అని వసుచరిత్రమునందును, హరిశ్చంద్ర నలోపాఖ్యానము నందును ఏకరీతిగనే గలదు. ఇటుల వీరిపితామహ ప్రపితామహుల పేర్లు అభిన్నముగా నుండి, తండ్రులయొక్కయు, వీరియొక్కయు పేరులుమాత్రము భిన్న భిన్నముగా గానవచ్చుచుండినను నేటికిని కొందరయ్యలు వీరు అభిన్నులని తలంచుట ఎంతయు వింత.

వీరు చెప్పుకొనియున్న విధముగనే వీరి వంశావళి నీ క్రింద పొందుపరచుచున్నాను. అవధరింపుడు.




## చరిత్రాంశములు - ఎఱతిమ్మపార్థివుడు

నరసభూపాలీయమునందలి చరిత్రాంశములబట్టి శాస్త్రిగారు ఆగ్రంథము ౧౫౬౦ ప్రాంతమున అనగా తల్లికోట యుద్ధమునకు పూర్వమే రచింపబడినదని నిశ్చయించిరి.

నరసభూపాలీయము తల్లికోట యుద్ధానంతరము, తిరుమలరాజు పట్టాభిషేకానంతరమున రచింపబడినదని నా అభిప్రాయము. ఇందలియాథార్థ్యనిర్ణయమునకు చారిత్రకప్రమాణము లవసరము గావున వానిగూడ నిట దిక్ప్రదర్శకముగ నుదాహరింతును.

# కృష్ణదేవరాయల వంశవృక్షము.




కృష్ణదేవరాయలు మృతుడైనపిదప అతని సవతితమ్ముడగు అచ్యుత దేవరాయలు రాజ్యమునకు వచ్చెను. ఇతనికాలములో ఇతని బావమఱదియగు సలకమ తిమ్మరాజు ప్రధానియైయుండెను. కృష్ణదేవరాయల అల్లుడగు అళియరామరాజునకును, ఈమంత్రికిని సరిపడకపోవుటచే విజయనగరరాజ్యమున రెండుపక్షములేర్పడియుండెను. ఈతిమ్మరాజు మేనల్లుడగు వేంకటదేవరాయలను సంహరించి తాను రాజయినని కొందరును, అతడే మరణించుటచే ఈతిమ్మరాజే రాజుగా ప్రకటించుకొనెనని కొందరును చరిత్రకారులు భిన్నమతములప్రకటించిరి. వేంకటదేవరాయలుమృతినొందినపిమ్మట సక్రమముగువారసు సదాశివరాయలే. ఈవిధముగ తిమ్మరాజు సదాశివరాయలరాజ్యమునకాటంకమయ్యెను.

# అళియరామరాజువంశ వృక్షము:—

ఆర్వీటి బుక్కరాజు.

- సింగరాజు.
- రామరాజు.
  - పెద తిమ్మరాజు.
  - రాచూరిపిన తిమ్మరాజు
  - కొండరాజు.
  - శ్రీరంగరాజు.
    - కోనరాజు.
    - తిమ్మరాజు.
    - అళియరామ రాయలు, లేక రామరాజు ౧౫౪౨-౬౫
    - ఎఱ్ఱతిమ్మ రాజు. లేక తిరుమలదేవ రాయలు. వసుచరిత్ర కృతిపతి. ౧౫౬౭-౭౨
    - వేంకటరాజు.
    - లక్కాంబ. నరసభూపాలీయకృతిపతి యగునరస రాజు తల్లి.
    - ఓబాంబ. రామాభ్యుదయకృతి భర్తయగు గొబ్బూరి నరసరాజు తల్లి.
    - కోనమాంబ తిమ్మరాజు తల్లి, కొండవీటి దుర్గాధిపతి, పరమయోగివిలాస కృతికర్త.

సలకయ తిమ్మరాజును సంహరించి రామరాజు ౧౫౪౨ లో సదాశివరాయలను రాజ్యాధిపతిగ చేసెనని కొందరును, సదాశివరాయలను కారాగారమునందుంచి రామరాజే రాజయ్యెనని కొందరును వ్రాసియుండిరి. ఏయి సంగతి సందర్భముల విచారించిన రామరాజు మొట్టమొదట సదాశివునే పట్టాభిషిక్తు నొనరించి, తాను రాజప్రతినిధియై (Regnt) ఎనిమిది సంవత్సరములు సదాశివుని పేర రాజ్యము చేసెననియు, అనంతరము ౧౫౫౦ మొదలు సదాశివుని పేర గాక ఉభయులుచేరి రాజ్యకార్యములు నిర్వహించుచున్నట్లు శాసనముల వలన విదితమగుచున్నది. ౧౫౬౨-౬౩ వ సంవత్సరములందు రామరాజు సదాశివుని కారాగృహ బంధితుని గావించి తానే సింహాసన మధిష్ఠించియున్నట్లు విశేషముగు పరిశ్రమ జేసి పరిశోధించి ప్రకటించిన, 'అళియరామ భూపాలుడ'ను టి. శివశంకరంగారి గ్రంథమువలన దెలియుచున్నది.

౧౫౬౫ సంవత్సరము జనవరి ౨౫ తారీఖున మహమ్మదీయులగు బీజపూర్, అహమ్మదునగర్ మొదలగు నవాబులకును రామరాయాదులకును చరిత్రప్రసిద్ధమగు తళ్ళికోట యుద్ధము ఆరంభమై కొంతకాలము జరిగియుండెను. అందు రామరాయలును, తిరుమలరాయల జ్యేష్ఠపుత్రుడగు రఘునాథరాజును, వెంకటాద్రియు చనిపోయి తిరుమలరాయలు చావుతప్పి కన్నులొట్టపోవుటచే ఏకాక్షియు, ఏకాకియు నయ్యెను. దీనితో విజయనగర రాజ్యప్రతాపభానుడు నామ రూపములులేక అస్తమించిపోయెను.

ఈ యుద్ధానంతరము తిరుమలరాయలు విజయనగరమునకు విచ్చేసి అధికమూల్యములగు వస్తువుల తీసికొని పెనుగొండకుపోయి (అనంతపురము జిల్లా) అచట జీర్ణకర్ణాటరాజ్యస్థాపకుడయ్యెను. (౧౫౬౭).

ఈ తిరుమలరాయల పట్టాభిషేకానంతరమే ఈ నరసభూపాలీయము రచింపబడినదని చరిత్రాంశములను బట్టి ఋజువు పఱతును.

నరసభూపాలీయము ౧౫౬౦ ప్రాంతమున రచింపబడినదని శాస్త్రిగారు నిర్ధారణ చేసిరను విషయము ఇదివరకే వ్రాసియుంటిని. మూర్తికవి నరసరాజుయొక్క తల్లి లక్కమాంబ వంశవృత్తాంతము చెప్పదలచి ఒక్క పద్యముతో ఆమె తండ్రివరకు గల పూర్వీకుల వృత్తాంతమంతయు పూర్తిగా వచించెను. తరువాత ఈమె సోదరులగు కోనరాజు, తిమ్మరాజులను ఒక్కొక్క పద్యముతోడను, రామరాజును రెండు పద్యముల తోడను, తిరుమలరాజును ఒక్క పద్యము తోడను, వేంకటరాజును నాలుగు పద్యములతోడను, వీరి వంశమును నతి సంగ్రహముగ నుపవర్ణించెను.

అందు పెద్దవాడగు కోనరాజు కీర్తివంతుడనియు, తిమ్మరాజు పరాక్రమశాలి యనియు, వర్ణించెనేగాని చరిత్రాంశము లేవియు వారిని గురించి ప్రస్తావించి యుండలేదు. రామరాజు సలకయ తిమ్మని సంహరించి, కర్ణాటక రాజ్యమంతయు స్వాధీనము చేసికొని మహామ్మదీయ ప్రభువుల నందఱను సామంతులనుగాచేసి లోకమంతయు రామరాజ్యము

చేసెనని చరిత్రాంశములతో నొకపద్యమును శ్లేషభంగిని శ్రీరామునితోఁ బోల్చి వేరొకపద్యమును మూర్తికవి చెప్పెను. ఎఱతిమ్మరాజు (వసుచరిత్ర కృతిపతి) అవక్ర పరాక్రమము తోడను, అఖిలైశ్వర్యములతోడను రాజ్యాధిపతియై పరిపాలించు చున్నట్లువవర్ణించెను. వేంకటరాజు బల పరాక్రమ వంతుడై మహమ్మదీయుల సంహరించి, వారి కోటలను స్వాధీనము చేసికొన్నట్లు వర్ణించెను. ఇది నరసభూపాలీయము వలన దెలియబడు సంగ్రహచరిత్రము.

ఇక వీరినిగురించి ఇందుల వ్రాయబడిన విషయమయి శాస్త్రిగారుచేసిన వ్యాఖ్యానమున ఒక్కొక్క దానికి సమాధానముల నుల్లేఖింతును.

కోనప్రభృతులు జీవించియుండిరనుట:—

"నరసభూపాలియ కాలమున కోనప్రభృతుల వర్ణించుటలో నొకరినయిన భూతకాలిక క్రియచే నిర్దేశింపకుండుటచేతను, వసుచరిత్రమున కోన విభుప్రభృతులను వర్ణించుటలో కోనవిభుని, తిమ్మరాజును భూతకాలిక క్రియలచే నిర్దేశించుట చేతను, గోనవిభు, తిమ్మవిభు, రామరాజులు నరసభూపాలీయ కాలమునకు జీవించియున్నారనియు, వసుచరిత్రకాలమున మృతినొందిరనియు నూహించుటకుగొంత యవకాశమున్నది" (వసు. వి. ౮౨.) అని శాస్త్రిగారు వ్రాసియున్నారు.

సమాధానము:—

భూతకాలిక క్రియలచే వీరిని వర్ణించినమాట నిజమే. శాస్త్రిగారన్నటుల చరిత్రజ్ఞానములేనివారు కోనరాజుప్రభృ

తులు జీవించియున్నటులనే తలంతురు. కానివాస్తవముగ ఈ సోదరులలో తిరుమలరాజుతప్ప మిగిలిన నలుగురును మరణించియేయుండిరి. వీరిలో వేంకటాద్రి తళ్ళికోటయుద్ధమున మరణించెనని కొందరును, లేదనికొందరును చరిత్రకారులు వ్రాసియుండిరి. ఇట్లు నరసభూపాలీయకర్తవలెనే వసుచరిత్రకారుడును వీరి వంశీకుల వర్ణించుటలో వర్తమానక్రియలనే వాడియుండెను. (చూడుడు. వసు. ౧ఆ. ౩౫-౩౬ప.)

ఇటులనే రామాభ్యుదయకర్తగూడ వర్తమాన క్రియలతో చనిపోయిన వారిని వర్ణించుటయు జరిగినది.

"అతిపవిత్ర మూర్తిత్రయం బనంగ
నతులతర దీప్తి వహ్నిత్రయంబనంగ
రామరాజును తిరుమలరాజు వేంక
టాద్రిరాజును మనిరి విఖ్యాతమహిమ"

(రామాభ్యుదయము. ౧ ఆ. ౫౨ ప.)

అని భూతకాలికక్రియచే వర్ణించి, తరువాతరామరాజు కుమారుల నుగ్గడించి పిదప "ఏతాదృశకుమార జనకుండై రామరాజశేఖరుండలరు" (౧ఆ. ౫౨)

ఇటులనే తిరుమలరాజును భూతకాలికక్రియచే వర్ణించి అతని సంతానమునుగూర్చి చెప్పి, "ఇట్టి సంతానంబుగాంచి తిరుమలరాజు రాజిలు" అని మరల వర్తమాన క్రియచే చెప్పెను. ఇటులనే నరసభూపాలీయకర్తయు గతించినవారిని గూర్చికూడ వర్తమానక్రియలతోడనే చెప్పియుండెను.

ఇంతియగాక ఈ కోనరాజు, తిమ్మరాజులను గురించి, చరిత్రాంశములతో నరసభూపాలీయకవి చెప్పకపోవుటచేతను, ఏ చరిత్రకారుడును చరిత్రాంశములతో వీరివిషయమును చెప్ప కపోవుటచేతను, అయ్యలరాజు రామభద్రుడు తన రామా భ్యుదయమునందును రామరాజు మేనల్లుడగు తిమ్మరాజును తన పరమయోగివిలాసమున అళియరామరాయ తిరుమల రాయ వేంకటాద్రులనుమాత్రమే పేర్కొనుటచేతను, వసుచ రిత్రకారుడును ఇటులనే "అయనుజుల్ విశుద్ధహారి" (౧ ఆ. ౫౭ ప.) అను పద్యమున తిరుమలరాజు, వేంకటాద్రులను మాత్రమే రామరాజునకు సహాయకులుగా పేర్కొనుటచే తను, ఫాదర్ హెరాస్ గారుకూడ తమఆర్వీటిచరిత్రమున కోన తిమ్మరాజులు రామరాజుప్రభృతులు ప్రసిద్ధులుకాకపూర్వమే మరణించినటుల వ్రాసియుండుటచేతను (పుట ౨౦) నరసభూ పాలీయరచనాకాలమునకు చాల పూర్వమే వీరు మృతిజెంది నటుల దృఢముగ జెప్పవచ్చును.

## రామరాజు జీవించియుండెనా?

,,మఱియు నరసభూపాలీయరచనాకాలమునకు రామ రాజు తురుష్కులచే వధింపబడుటగాని, విజయనగరరాజ్య విప్లవముగాని జరిగియున్నట్లగపడదు.

,,ఖలు నతిద్రోహిసల్కయతిమ్మనహరించి
సకల కర్ణాటదేశంబు నిలిపె,,

నని నరసభూపాలీయమున వర్ణింపబడియున్నది.

నలకయ తిమ్మని జయించి కర్ణాటరాజ్యము కృష్ణ రాయల వంశమునకు నిలిపినట్లుగ నిందు వర్ణింపబడినది గాని విజయనగరరాజ్య విప్లవ మిందు సూచింపబడలేదు,, (వసు. వి. ౮౨.) అని శాస్త్రిగారు వ్రాసిరి.

సమాధానము:—

నరసభూపాలీయ రచనము నాటికి రామరాజు జీవించి యున్నట్లు శాస్త్రిగారు పయిపద్యమువలన తేల్చిరి. వారుదహరించిన పద్యమునే పూర్తిగ నుదహరించి, రామరాజు చని పోయినట్లుగను, విజయనగరరాజ్య విప్లవము సూచింపబడమికి కారణమును తెలియ బఱతును.

,, ఖలు నతిద్రోహి నల్కయతిమ్మని హరించి
సకల కర్ణాటదేశంబు నిలిపె,
నతుని వర్ధితుని దత్సుతుని బట్టముగట్టి
కుతుపనమల్కన క్షోణినిలిపె
బదిలుడై రాచూరు ముదిగల్లు గప్పంబు
సేయగాంచి సపాదు సీమనిలిపె
శరణన్న మల్కనిజామును కభయంబొ
సంగి తదీయరాజ్యంబునిలిపె
నవనినంతయు రామరాజ్యంబుసేసె
దనగుణంబులు కవికల్పితములుగాగ
నలవియె రచింప సత్కావ్యములను వెలయ
భూమి నొక రాజమాత్రుండె రామవిభుడు''

ద్రోహియగు సల్కయతిమ్మని సంహరించి, కర్ణాట రాజ్యమును ౧౫౪౨ సం॥ న స్వాధీనము చేసికొనుటయు, తన ఆశ్రితుడగు ఇబ్రహీం కుతుబ్ షాను ౧౫౫౦ సం॥ న గోలకొండ నవాబుగ చేసిన వృత్తాంతమును, బీజపూరు ప్రభువగు ఇబ్రహీం ఆదిల్ షాపై ౧౫౪౩ వ సం॥ న దండెత్తగా అతడు రాజకీయచతురతచే రామరాజుతో రాజీ చేసికొని రాయచూరు, ముదిగల్లుదుర్గములనిచ్చి అతనికి సామంతుడైన సంగతియు, శరణుజొచ్చిన అహమ్మదునగరపు ఏలికయగు నిజామ్‌షాకు అభయమిచ్చికాపాడి, వాని రాజ్యము ౧౫౫౮ వ సం॥ న నిచ్చినదియు చెప్పి, ఈ విధముగ భూమినంతయు రామరాజ్యము సేసిన రామరాజు కేవలము రాజుకాడనియు, అతని గుణములను వర్ణించుటకు కవులకు తరముగాదనియు మూర్తికవి రామరాజుయొక్క ప్రతాపోత్కర్షమును-రాజ్య విస్తారమునంతయు నిందు నుపవర్ణించెను.

పయిపద్యమున ౧౫౫౮ వరకుగల చరిత్రాంశములను వర్ణించి భూమియంతయు రామరాజ్యము సేసెనని మూర్తికవి చెప్పెను. తరువాత రామరాజుచేసిన ఘనకార్య మేమి? తరువాత చరిత్రాంశము ఈతడు ౧౫౬౫ సంవత్సరమున మరణించుటయే. ఈ సంగతి చెప్పుట ఉచితమును గాదు. మరియు విస్తరించి చెప్పుటకిది విజయనగరరాజులచరిత్రమును గాదు. నరసభూపాలుని మేనమామల శౌర్యప్రతాప విభవములను నిందు వర్ణించుటయే యుచితముగాన తళ్ళికోట యుద్ధమున రామరాజు మృతినొందెననిగాని, రాజ్యము గోల్పోయె

ననిగాని, తిరుమలరాయలు ఏకాశీయమ్యేనపిగాని చరిత్రాంశములను వర్ణించుట సమంజసముగాకపోవుటచే విజయనగర రాజ్యవిప్లవ మిందు సూచింపబడలేదు. ఇటులనే రామాభ్యుదయ కర్తయు సూచించియుండలేదు.

తిరుమలరాయల వర్ణనమునుబట్టి తళ్ళికోట యుద్ధానంతరమే నరసభూపాలీయము రచింపబడినట్లు పిదప సుస్పష్టము జేయబడును.

తిరుమలరాయలు పట్టాభిషిక్తుడు కాలేదా!

"ఇంతియగాక రామరాజును దురుష్కులు వధించి విజయనగరమును ఆక్రమించుకొన్న పిదప దిరుమలదేవ రాయలు మిగిలినరాజ్యమునకు రాజై పెనుగొండను రాజధానిగ జేసికొనెను. అట్లు నరసభూపాలీయ కాలముననే రాజ్యాధిపతియై యున్నయెడల వసుచరిత్రమందువలె నీకావ్యమునందును దిరుమలరాజు జీర్ణకర్ణాటరాజ్య పునరుద్ధారి అనియు, దిరుమలదేవరాయలనియు వర్ణింపబడియుండును.

"తనభుజాదండ కోదండ మఖండమై,
యనువేల శరవృష్టినాచరింప
తనహేతి శతకోటి ఘనధారధళ్యమై
ప్రతిపక్షబల భిదాపటిమనెఱప
తన విగ్రహంబు సజ్జనమనోహారియై
మంజుఘోషాశ్లేషమహిమజెలగ
దనవైభవంబు సంతానసమగ్రమై
సురభి సంభృతగుణ స్ఫురణజెంద

రాజ దేవేంద్రుడితడన దేజరిల్లు
ననఘు చాళుక్యనారాయణాంకవివిధ
బిరుద మన్నెవిభాళాది బిరుదశాలి
పాత్రిభవో పేతుడెఱతిమ్మ పార్థివుండు."

(నర. ౧ ఆ. ౮౪ ప.)

అని యిట్లు సామాన్యముగా నెఱతిమ్మరాజని తిరుమలదేవరాయలు వర్ణింపబడెను. విజయనగరరాజ్య పునరుద్ధారణమే ఇతడుచేసి యావరకు సార్వభౌముడైయున్న యెడల నట్టి ముఖ్యవిషయముల వర్ణింపక ఇట్లు సామాన్యముగా వర్ణించియుండడుగదా! వసుచరిత్రమం దిట్లుగాక విజయనగర రాజ్య విప్లవమును దిరుమలరాయలు చేసిన కర్ణాటరాజ్య పునరుద్ధారణమును వర్ణింపబడుటచే నరసభూపాలీయముకన్న వసుచరిత్రమే వెనుకటిదని స్ఫురించును.

నరసభూపాలీయ కాలమునకు దిరుమలరాజు పట్టభద్రుడు కాకుండుట నెఱతిమ్మపార్థివుండని వర్ణింపబడెను. పిదప కర్ణాటసార్వభౌముడగుటచే గర్ణాటసార్వభౌములగు కృష్ణదేవ రాయలు మొదలగువారికి వర్తించుచున్న "దేవరాయ"లను బిరుదము చేర్చి దిరుమలదేవరాయలను నామముతో వసుచరిత్రమున వర్ణింపబడెననియుదోచుచున్నది." (వసు౮ ౨-౮౩).

సమాధానము:—

నరసభూపాలీయము రామరాజు వధింపబడి తిరుమల రాయలు పట్టాభిషిక్తుడయిన పిదపనే రచింపబడెను. కోన ప్రభృతులు మృతినొందినట్లు చెప్పబడనట్లుగనే విజయనగర

రాజ్య విధ్వంసమును గూర్చియు, ఔచిత్యలోపమునకు వెఱచి వర్ణించియుండలేదు. అదియునుగాక - నరసభూపాలీయము తిమ్మరాజునకు కృతియిచ్చిన గ్రంథముగాదు. ఇందుచే విజయనగర రాజ్యపు పుట్టు పూర్వోత్తరముల గురించిగాని వారిరాజ్యవినాశమునుగురించిగాని అప్రస్తుతమని తలచి చెప్పియుండలేదు. కృతిభర్తయొక్క మేనమామల ప్రతాపములనుగ్గడించుటయే స్వారస్యముగ నుండునని కవి తలంచెను. ఇతడే గాక తిరుమలరాయుల మేనల్లుడగు గొబ్బూరి నరసరాజునకు కృతినిచ్చిన రామాభ్యుదయమునందు నిటులనే అళియరామరాజాదుల శక్తిసామర్థ్యాదుల మాత్రమే కవి వర్ణించెనుగాని వసుచరిత్రమునందువలెనే వర్ణింపబడలేదు. ఇది నరసభూపాలీయము, వసుచరిత్రలకంటె అధునాతనమయినది.

కనుక జీర్ణకర్ణాట రాజ్య పునరుద్ధారి యని చెప్పక పోయినంతమాత్రమునగాని, ఎఱతిమ్మ పార్థివుడని చెప్పినంత మాత్రమున గాని నరసభూపాలియము తిరుమల రాయుల పట్టాభిషేకమునకు పూర్వమే రచింపబడినదని చెప్ప వీలులేదనియు పయిపద్యముయొక్క వర్ణనమునుబట్టి నరసభూపాలీయము తిరుమల రాయుల పట్టాభిషేకానంతరమే రచింపబడినదని ముందు తెలియజేయబడును.

**తిరుమలరాజు:—**

నరసభూపాలీయమున ఎఱతిమ్మపార్థివు డని పిలువబడిన తిరుమల దేవరాయలు రామాభ్యుదయమునను, పరమయోగి విలాసమునను తిరుమలరాజు అని మాత్రమే

పిలువబడెను; గాని తిరుమల దేవరాయలని చెప్పబడలేదు.

“.............తిరుమల విభుడు ను
దారుడు శ్రీవేంకటాద్రి ధరణీధవుడున్”

రామాభ్యుదయము ౧ ఆ. ౫౧ పు.

“.............తిరుమల
ప్రభు వేంకటేంద్రుల భాగినేయ”

పరమయోగివిలాసము.

పయి రెండు గ్రంథములనే గాక తిరుమలరాయల కుమారుడగు వెంకటరాయలకు కృతియిచ్చిన చంద్రభాను చరిత్రమునందును తిరుమలరాజనియే గలదు.

“తిరుమల రాజతనయ”

(చంద్రభానుచరిత్రము)

పయిపద్యముల గాంచిన ఇతనినామధేయ మేమని నిర్ణయమగును? పట్టాభిషేకానంతర నామమేమని నిర్ణయమగును? ఇందువలన నితనిని ఇతరకవులు తిరుమల రాజని వర్ణించినట్లుగనే నరసభూపాలీయకవి ఎఱతిమ్మ పార్థివుండని వర్ణించెను. వసుచరిత్రకారు డొక్కడు తప్ప ఇతనిని తిరుమల దేవరాయలని ఎవరును వర్ణించి యుండలేదు. పయిగ్రంథములన్నియు తిరుమల రాయల పట్టాభిషేకానంతరము వ్రాయబడినవియె.

పార్థివశబ్దార్థము:—

నరసభూపాలీయమున “ఎఱతిమ్మపార్థివుడు” అని తిరుమలరాజు వర్ణింపబడెను. ఇది సామాన్యముగా వర్ణింపబడి

నట్లు శాస్త్రిగారు వ్రాసిరి. ఈపార్థివ శబ్దమునకు నర్థమేమియో నిర్ణయమయిన, అతడు సామాన్యుడుగనో, అసామాన్యుడు గనో వర్ణింపబడిన విధానము తేటతెల్లమగును.

"రాజ్ఞి రాట్పార్థివ క్ష్మాభృన్నృపభూపమహీక్షితః
(అమరకోశము. ద్వి. కాం. ౪౫౮)

"ఇవి ప్రజలను పాలించు క్షత్రియునికిని, ఆకార్యము చేయు, మరియొకనికిని పేర్లు" అని నిఘంటకారుడగు అమరసింహుని పార్థివశబ్దమునకు నర్థము వ్రాయుటచేతను, పార్థివ శబ్దము ఇతనికి ఉపయోగింపబడుటచేతను నరసభూపాలీయము తిరుమలరాజు పట్టాభిషిక్తుడైన పిమ్మటనే రచింపబడెనని తెలియుచున్నది.

బిరుదములు:—

"మరియు పైనుదహరించిన శాసనములోని బిరుదములుకొన్ని విజయనగర రాజులకు పారంపర్యగతములును, మఱికొన్ని యళియ రామరాజవంశమువారికి గులక్రమాగతములునైయున్నవనుటకు వీరిలో నెవ్వరిని వర్ణించినను నీబిరుదములనే యుపయోగించుటయే నిదర్శనము" (వసు.వి.౧౫౨)

"పయిబిరుదములలోగొన్ని నరసభూపాలీయమునందు కవి యుపయోగించియున్నాడు" (వసు. వి. ౧౫౩) అని శాస్త్రిగారు వ్రాసియున్నారు.

సమాధానము:—

"నరసభూపాలీయమునందలి ఎఱతిమ్మరాజునకుగూడ బిరుదముల కవి యుపయోగించియున్నాడు. ఆబిరుదములవ

లన ఇతఁడు రాజని చెప్పుటకు అవకాశము లేకుండ నుండగలందులకు ఈవంశములోని వారికందరకును ఈబిరుదములనుచేర్చుదురు. అటులనే ఎఱతిమ్మరాజునకును చేర్చిరి" అని శాస్త్రిగారు వ్రాసిరి. ఇది ప్రామాదికము. నరసభూపాలీయకవి ఎఱతిమ్మరాజునకుదప్ప వీరి అన్నదమ్ములలో తదితరుల కెవ్వరకును బిరుదములను వాడియుండలేదు. దానికి కారణము విజయనగరరాజ్య విప్లవానంతరము ఎఱతిమ్మరాజు రాజ్యము చేయుచుండుటయు, ఆకాలముననే నరసభూపాలీయము రచింపబడుటయు, నయియున్నది.

నరసభూపాలీయమునందలి బిరుదములు:—

"రాజ దేవేంద్రుడితడన దేజరిల్లు
ననఘ చాళుక్య నారాయణాంక వివిధ
బిరుద మన్నె విభాళాది బిరుదశాలి
ప్రాభవోపేంద్రు డెఱతిమ్మపార్థివుండు"

(న. భూ. ౧ ఆ. ౪౮ ప).

అనఘ, చాళుక్య నారాయణ మొదలగు వివిధబిరుదములు ఇతనికి గలవని వర్ణింపబడెను. కావున అనఘ, చాళుక్యనారాయణ, మన్నెవిభాళ అని మూఁడు బిరుదములుమాత్రమేగాక ఇతనికి అనేక బిరుదములు గలవని కవి వర్ణించియుండెను. ఈబిరుదములను వసుచరిత్రకారుడు వర్ణించెను. ఇతఁడు సంగ్రహముగా ముఖ్యబిరుదములను పేర్కొని ఇట్టివి అనేక బిరుదములు గలవని చెప్పుటచేతను, ఇతనికితప్ప ఇతరులకు ఈకవి బిరుదములను వర్ణించి యుండకపోవుటచేతను

ఇతడు నరసభూపాలీయ రచనాకాలమునాటికే పట్టాభిషిక్తుడై యుండెనని నిర్ణయ మగుచున్నది.

పయిబిరుదముల పుట్టుపూర్వోత్తరములు:—

పయి బిరుదములు వసుచరిత్రమునందుకూడ వర్ణింపబడినవి. ఈబిరుదములగల శక్తిసామర్థ్యములు ఎటుల వచ్చినది అందుపవర్ణింపబడి యుండుటచే ఆభాగములనిందుదాహరించుచున్నాను.

చాళుక్యనారాయణ:—

"త్రైలోక్యవినుత, చాళుక్యనారాయణాంక, సంకల్పితాశేష, పోషణప్రాభవుండును—(వసు. ౧ఆ. ౫. ౧౪.)

"మూడులోకములవారిచేత చాళుక్యనారాయణ బిరుదమనెడి నామముచేత సంకల్పింపబడిన సమస్తజన పోషణమందు సామర్థ్యము గలవాడు" అని యర్థము.

మన్నెవిభాళాదులు:—

"ఉన్నత జయజన్యబిరుద
మన్నెవిభాళాది మాన్యునకు" (వసు. ౧ఆ. ౮౨.)

"ఉత్కృష్టమయిన విజయములవలసంభవించిన మన్నెవిభాళాదిమొదలగు బిరుదములచేత పూజ్యుడైనవానికిని" అని అర్థము.

ఇటుల రామరాజభూషణుడు వర్ణించిన బిరుదములే మూర్తికవి ఉదాహరించియుండెను. శాసనములందుగూడ ఈబిరుదములెటులవచ్చియున్నదియు ప్రస్తావించబడియున్నది.

"విఖ్యాతబిరుద మన్నెవిభాళలీలస్య
విజయశీలస్య"—(ఎపిగ్రాఫిక. ఇండికా. 9పు. 38పు.)

విజయపరంపరలచేతనే ఈమన్నెవిభాళాది బిరుదములు వచ్చెనని విశదమగుచున్నదిగదా! విజయనగరరాజ్య విప్లవానంతరమే ఇతడు తిరిగి శత్రువులను జయించి, విజయము నందుటచే ఇటుల వర్ణింపబడెను. కనుక విజయనగరరాజ్య విప్లవానంతరమే నరసభూపాలీయము రచింపబడినదని నిర్ణయమగుచున్నది.

ఎఱతిమ్మశబ్దము:—

వీరివంశములో అనేకులు తిమ్మరాజులుండిరి. వీరందరు వైష్ణవులగుటచే తరచుగా వీరికేపేరు పెట్టబడుచుండెను. తిమ్మశబ్దము తిరుమల శబ్దమునకు హ్రస్వరూపము. ఇందుచే "తిరుమల" యని పిలువబడువారు తిమ్మశబ్దముచేతను పిలువబడుచుండెడివారు.

ఇతనికి తిమ్మరాజను అన్నయుండెను. ఇతడు బహుశః అతనికంటె ఎఱ్ఱగనుండియుండుటచేతనో, లేక వీరివంశీకులలో ఎఱతిమ్మన అను వాడొకడు ఉండియుండుట చేతనో ఇతనికి ఈపేరును పెట్టియుండవచ్చును. నరసభూపాలీయకవి ఒక్కడే ప్రబంధకవులలో చరిత్రాంశములను సంపూర్ణముగను-సంగ్రహముగను వర్ణించుటలో కడుదిట్ట. ఏ కావ్యకర్తయు వాడనట్టియు, వాడుకలలో నున్నట్టియు, ఎఱతిమ్మశబ్దము తిరుమల రాజునకు నితడు మాత్రమే ఉపయోగించెను.

ఎఱతిమ్మశబ్దము తిరుమల రాజునకు పుట్టుపేరనియు, ఇతడు పట్టాభిషిక్తుడయిన పిమ్మట తిరుమల దేవరాయలని మాత్రమే వ్యవహరింపబడి యుండెననియు, నరసభూపాలీయమునందలి ఎఱతిమ్మశబ్దమును బట్టి యిది ఇతని పట్టాభిషేకమునకు పూర్వము రచింపబడినదని శాస్త్రిగారు నిర్ధారణము చేసియుండిరి.

వసుచరిత్రకారుడు తప్ప తిరుమల దేవరాయలని ఏకవియు వాడియుండలేదని లోగడనే సోదాహరణముగ చూపించియుంటిమి. ఇపుడు ఈ ఎఱతిమ్మ శబ్దము పట్టాభిషేకానంతరము గూడ పలువురు చరిత్రకారులు ఉపయోగించినట్లు ఉదాహరణముల జూపింతును.

'ఫెరిస్తా' యను మహమ్మదీయ చరిత్రకారుడు బీజపూర్ నవాబుల చరిత్ర ౧౬౧౨వరకు వ్రాసియుండెను. అట్టి యితడు ఎఱ్ఱతిమ్మరాజును, "ఎల్ తిమ్మరాజు", ఎల్ తుమ్మరాజు", అని నరస భూపాలీయకవివలెనే వాడెను. (ఫర్ గాటెన్ ఎంపైరు)

విజయనగర రాజ్య విధ్వంసనానంతరము అహమ్మదు నగర రాణి తిరుమలదేవరాయలకు కప్పము కట్టవలసినదని కబురుచేయగా, అదివిని "ఇబ్రహీం కుతుబ్ షా" "ప్రస్తుతపరిస్థితులలో ఎల్ తుమ్మరాజునుండి మనకు కప్పమును గోరుట ఏమాత్రము రాజకీయతంత్ర చాతుర్యముగాదు." (అరవీడు డైనాస్టి ఆఫ్ విజయనగర్ ౨౩౨ పు.) అని ఆమెకు వర్తమానమంపెను.

ఇందుచే వసుచరిత్రకారుడు తిరుమల దేవరాయలని వర్ణించినను యెఱతిమ్మరాజు అను పేరుతో మాత్రమే వ్యవహరింపబడెనని ఫెరిస్తాచరిత్రకారుని వ్రాతవలన మనకు విదితమగుటచే ఎఱ్ఱతిమ్మరాజను శబ్దము పట్టాభిషేకానంతరముగూడ ప్రచారమున నున్నదని సప్రమాణముగ స్పష్టపడుటచే ఇది పట్టాభిషేకమునకు పూర్వనామమని శాస్త్రిగారు గావించువాదము సమర్థనీయము కానేరదు.

నరసభూపాలీయమున తిరుమలరాజు సామాన్యుడుగా వర్ణింపబడెనా?

„తన భుజాదండకోదండ„ మను నీపద్యము నుదాహరించి శాస్త్రిగారు ఇతడు ఎఱతిమ్మపార్థివుడని సామాన్యముగ వర్ణింపబడెనని తమ వసుచరిత్ర విమర్శనమున సుస్పష్టముగ వ్రాసియుండిరి. పార్థివ శబ్దార్థము చేతను, అనఘ మన్నెవిభాళాదిబిరుదములచేతను ఇతడు రాజ్యాభిషిక్తుడుగా వర్ణితుడయినట్లు స్పష్టపఱచియుంటిని. ఇంతియే గాక యీ తిరుమలదేవరాయలను చరిత్రకారుడగు ఫెరిస్తాకూడ నరసభూపాలీయకవివలెనే ఎఱతిమ్మరాజని వ్రాసియుండుటచే ఇతడు పట్టాభిషేకానంతరముగూడ నాపేరుతోనే వ్రాయబడియుండుట విదితమగుటచే నరసభూపాలీయము తిరుమలరాయల పట్టాభిషేకానంతరమే వ్రాయబడినదనితలచుటకెట్టిసందియమునులేదు.

ఇంతియగాక నరసభూపాలీయమున వర్ణింపబడిన తిరుమలరాజ వృత్తాంతముగల యీపద్యముచేతను గూడ అతడాకాలము నాటికే పట్టాభిషిక్తుడైనట్లు సుస్పష్టమగుచున్నది.

,,తన భుజాదండకోదండ మఖండమై
యనువేల శరవృష్టి నాచరింప
తన హేతి శతకోటి ఘనధాళధళ్యమై
ప్రతిపక్షబలభిదా పటిమ నెఱప
తన విగ్రహంబు సజ్జన మనోహారియై
మంజుఘోషాశ్లేష మహిమ జెలగ
దన వైభవంబు సంతాన సమగ్రమై
సురభి సంభృతగుణ స్ఫురణ జెంద
రాజదేవేంద్రు డితడన దేజరిల్లు
ననఘు చాళుక్య నారాయణాంక వివిధ
బిరుద మన్నె విభాళాది బిరుదశాలి
ప్రాభవోపేంద్రు డెఱతిమ్మ పార్థివుండు,,

పయి పద్యమున మూర్తికవి తిమ్మరాజును ఇంద్రునితో బోల్చి శ్లేషభంగిని వర్ణించియుండెను. ఎఱతిమ్మరాజు పరమగు నిందలి భావమును తేటపఱచిన నిందితడు సామాన్యుడుగా వర్ణితుడో - సార్వభౌముడుగా వర్ణితుడో సహృదయులగు పాఠకులు గ్రహింపగలరుగదా!

తన బాహుఖండమునందలి కోదండము చెక్కుచెదరక అవిరతమగు బాణవృష్టిని గురియింపుచుండగా, తన ఖడ్గము వజ్రాయుధమువలె ఘనధాళధళ్యమై శత్రుసైన్యముల నురుమాడుచుండగా, తన దండోపాయము సజ్జనులకు నాహ్లాదకరమై మంజులములగు స్తోత్రములచే నొప్పుచుండగా, తన వైభవము సప్తసంతానములకూడికొని సద్గుణగుణస్ఫురణ

మును జూపుచుండగా, రాజులలో దేవేంద్రునివలెరాజిల్లుచు, అనఘ, చాళుక్యనారాయణాంక, మన్నెవిభాళాది బిరుదము నను గలిగి ప్రాభవములందు విష్ణుమూర్తివలె ఎఱతిమ్మరాజు ఒప్పుచున్నాడు.

ఈ వర్ణనము సామాన్యులకు సంబంధించినదా? ఇది పట్టాభిషిక్తుడగు రాజుయొక్క వర్ణనముగ కన్పించుట లేదా? ఇంతియగాక తిరుమలరాజు విజయనగరరాజ్య విధ్వంసనానంతరము స్వీయభుజాదండముచే శత్రునరపాలుర చెండాడి వెను వెంటనే తిరిగి రాజ్యమును సంపాదించుకొని పెనుగొండ యందుపట్టాభిషిక్తుడై సమస్తవైభవములననుభవించుట కవిచే వర్ణింప బడినటుల ఇతని వైభవము సద్గుణ గుణాప్రకాశము చెందుచున్నదనుటలో నాశ్చర్యమేమి? కనుక పయి పద్యము తిరుమలరాజు ప్రాభవము తెలుపుచుండుటచే విజయనగర విధ్వంసానంతరము తిరుమలరాయలు పట్టాభిషిక్తుడ యినపిమ్మట నరసభూపాలీయము మూర్తికవిచే రచింపబడెనని చారిత్రకాంశములచే తేటతెల్లమగుచుండుటచే, మూర్తికవి రామరాజ సభకు పోలేదనియు, అతనివలన నితడు "రామ రాజభూషణ"యను బిరుదము నందుట కల్లయనియు, అది వసుచరిత్రకారునినామధేయమేఅనియు విస్పష్టమగుచున్నది.

ప్రత్యక్ష ప్రమాణము:—

వైయ్యాకరణము గోపాలజయదేవరాజుగారు భట్టుమూర్తి రామరాజభూషణకవుల జన్మస్థానము గుంటూరు

జిల్లా, పల్నాడు తాలూకాలోని బట్రాజుల పురమనియు, తామా గ్రామమునకు వెళ్ళి, వారి సంతతివారితో మాట్లాడి నట్లు వ్రాసిన వ్యాసమునందలి కొన్ని పంక్తులను ఈ క్రింద పొందుపఱచుచున్నాను.

"రామరాజభూషణ కవీంద్రుడును, భట్టుమూర్తియు భిన్నులుగా చెప్పుటకించుకంతయు సంశయములేదు. సూరప రాజు కుమారుడు వసుచరిత్రకర్త రామరాజభూషణకవి. వేంకటాద్రియభూషణుని కుమారుడు కావ్యాలంకార సంగ్రహ కర్త యగు భట్టుమూర్తి.........రామరాజభూషణ కవి యొక్కయు, భట్టుమూర్తియొక్కయు వంశస్థులను జూచి నాడను"

ఆంధ్రపత్రిక, సిద్ధార్థ ఉగాదిసంచిక. ౧౨౧ పుట. ఇంతకంటె ప్రబలమగు ప్రమాణము లేమి కావలయును?

## సింహావలోకనము:—

ఇట్లు పరమప్రమాణములు స్పష్టతరముగ గానవచ్చు చుండగా భట్టుమూర్తి - రామరాజభూషణులు ఒక్కరేయని లక్షణకారులు, వ్యాఖ్యాతలును వ్రాసియుండుట చిత్రముగా నున్నది. ఈ వాదమును మొదట మీదవైచుకొన్నవాడు లక్షణదీపికాకారుడుగా గానవచ్చుచున్నాడు. ఇతడేగాక ఇతని సమీపకాలమునకు జేరిన వ్యాఖ్యాతలు, కొందరు కూడ లక్ష్యగ్రంథమగు వసుచరిత్రము వ్రాసినవిమ్మట లక్షణ గ్రంథమగు నరసభూపాలీయమును వ్రాసియుండెనని పొరపడి

ప్రాసియుండిరి. వసుచరిత్రమున రామరాజభూషణుడనియు, నరసభూపాలీయమున మూర్తియనియు కన్నులకు గట్టినట్లు గానవచ్చుచుండ పయిమాట నిజమని పాటించు టెట్లు పొసగును? "శతాంధాఃకూపం ప్రవిశంతి" యను న్యాయమున వీరందరు విమర్శనాబుద్ధిపొంతపోక ఒకే మార్గముబట్టిపోయిరి.

ఐక్యతావాదమునుపరిపోషించినవారు "భట్టుమూర్తి" యనునది బిరుదమని తలంచినట్లు దక్కనుకవులచరిత్ర, రివ రెండు టేలరుగారి వ్రాత, పురాణనామచంద్రికలవలన దెలియుచున్నది. ఈతలంపు కేవలము పరిహాసపాత్రము-సత్యము నకు కడు దవ్వునయినది. అయినను ప్రాచీనులపలుకుగదా!

ఈ హేతుజ్ఞానవిహీనమయిన ఐక్యతావాదమును పురస్కరించుకొని మన ఆధునిక విమర్శకులు తల్లక్రిందులుగా భట్టుమూర్తి పేరనియు, రామరాజభూషణుడు బిరుదమనియు నూతనపథము త్రొక్కి వాదించుచున్నారు.

ఆంధ్రసారస్వత మందెచ్చటను ఇతనికి ఈ బిరుదమున్నట్లు సూచింపబడియుండలేదు. ఇది అపూర్వముగా నవతరించిన సరిక్రొత్తవాదము. అనాలోచితముగ ప్రచారమున రూఢమైయున్న ఐక్యతావాదమును సమర్థించుటకు-సంరక్షించుటకు ఆవిర్భవించిన మహాస్త్రము. ఇదియు ప్రాచీనులవాదమువలెనే అప్రమాణమని సోపపత్తికముగ ప్రతిపాదింపబడెను.

ఇట్లు ఐక్యతావాదుల వాదములన్నియు నిరాధారములని సోపపత్తికముగ నిరూపించియుంటిని. చారిత్రకాంశము

లుగూడభట్టుమూర్తి రామరాజభూషణుడు కాడని సుస్పష్టముగావించుచున్నవి.

"అలవిన్నకోట పెద్దనలక్షణజ్ఞత
శబ్దశాసనకవి శబ్దశుద్ధి
ప్రాబంధిక పరమేశ్వరు నర్థమహిమంబు
భయకవి మిత్రుని పదలలిత
శ్రీనాథువార్తా ప్రసిద్ధినాచనసోము
భూరికారిస్యంబు పోతరాజు
యమకవిధము మల్లయ మనీషిచిత్రంబు
పింగళి సూరకవి పరుశ్లేష
నాంధ్రకవితా పితామహు నల్లికబిగి
ముక్కుతిమ్మన తేటయు భూషణుని య
లంకృతియు నీ కెకలదా తలంప లక్ష
ణకవి యప్పయ వేంకటసుకవిచంద్ర"

రామరాజభూషణునకు మిక్కిలి సమీప కాలమువాడగు గణపవరపు వేంకటకవి ప్రబంధరాజ వేంకటేశ్వర విలాసమను లక్ష్య-లక్షణ గ్రంథములో తనకిన్ని ప్రజ్ఞా పాటవములున్నట్లు చెప్పికొనెను.

ఆంధ్రసారస్వతమున ప్రసిద్ధులగు కవుల నామములను, బిరుదనామములను మేళముగావించి చెప్పిన పయిపద్యమున "రామరాజభూషణ" అను శబ్దమున "రామరాజ" యనునది తుంచివైచి, "భూషణ" యని పేర్కొనుట "రామరాజ

భూషణ" యనునది నామమే అనియు, బిరుద మెంతమాత్ర మును గాదనియు తేటతెల్లమగుచున్నది గదా!

ఇది బిరుద మేయని పయిపద్యకర్త తలంచియుండినచో, రామరాజ యనునది త్రుంచివైచి, ,,భూషణ,, యని ఏక మాత్రపదముగ ప్రయోగించుటలో అర్థముగాని స్వారస్యము గాని లేదుగదా! సామాన్యముగ మనము వ్యవహారమున నామ ములను త్రుంచివాడుట వాడుకగలదు; గాని బిరుదములను త్రుంచివాడుట పరిపాటియైలేదని అక్షరజ్ఞుల కెల్లరకు అను భవ పూర్వముగు విషయమేగదా!

ఇంతియేగాక వసుచరిత్ర వ్యాఖ్యాతయగు సోమనాథ కవిగూడ ‹రామభూషణ నామధేయముగల కవి!› అని వ్రాసి యేయుండెను. వేయేల! రామరాజభూషణుడే హరిశ్చంద్ర నలోపాఖ్యానమున స్వీయచరిత్ర ప్రస్తావనా సందర్భమున ,,రామభూషాఖ్యబరగు సుకవి,, నని ఘంటాపథముగ చెప్పి కొనియుండ అన్యుల ప్రమాణవచనము లేల?

ఇట్లు భట్టుమూర్తి-రామరాజభూషణులు భిన్న భిన్న నామములతో నున్న, అన్నదమ్ముల బిడ్డలగు సోదర కవులని చారిత్రక ప్రమాణములతోగూడ నిరాక్షేపముగనిర్ణయమగు చుండ, వారు అభిన్నులని ఐక్యతావాదులు వాదించుట బోడి తలకును మోకాళ్ళకును ముడిపెట్టుటను బోలుచున్నది.

ఇకనయినను పండితపాఠకులు మూర్తి రామభూషణు లభిన్నులను వ్యవహారమును తొలగించి, భిన్నత్వమును గ్రహించి, వాఙ్మయ ప్రపంచమున వారికి ప్రత్యేకకీర్తి ప్రతిష్ఠల ప్రతిష్ఠాపింతురు గాక!

